సత్వహీను నభిమానహీనుని గుణహీను । నాదరింపకునీవుము నుపటివలె నెంచినావు, లేనతనితలంపబలనను బొందుపనెగావ ణుఁడు వింటి 1

దశముఖునిపలుకువిని సీత బలికెఁ దృణమంతరువుగాఁ గొనికినుకచేత । దశరథసుతునకళికి, కాదా, యొక బీదతపస్వి కన్నోటఁగి, ననుదెచ్చుటక్రవ్యాద । పసహావిస్సుకుక్కగొనులె క్క, వెసననుభవింతువాఫలంబురాముబాణ । విశకలాంగుఁడ వైలంగుమొందు తటిన్నృపాల, శశినెటిఁగెదవునధిదాఁటివచ్చి పొగరుఁచుసనె వింటి. 2

పిడుగుల కన్నకడిదిగాను మాటలను పలికినసిగొనిత్రే యంబూను । దుష్కురక్కసులదొర, నెదిరిగుండొదరి తొగలేని చెలులు పదువేవురున్నారునూటి । గడుసరియుదినుజాం, గన దనుజా, గ్రణిదీని పైఁ బ్రేనుమానిపోవమురిన్ను । నుడుద్వమాస ముల నాపొందొల్ల దేనిలలన, యొడలుకావలివారుతినుఁడని చనియె రావణుఁడు వింటి 3

అవనిజనుస్వతర్జనముల బెదరించి, దనుజాంగనలుబహు విధముల । సవినయముపల్కుఁడీ సతికిరఘుపతికి, జయమైరావ తమునెక్కి, రామలక్ష్మణులిచ్చటికివచ్చి । తవిలిలంకఁగాల్చి, యరిఁగూల్చిధరణిజనుగొనియయోధ్యఁజేరఁగఁగలగంటి । విన నునుండ్డె తైలమంటుకగుంటఁగూల, వింశతిభుజుఁగంటినిదితప్ప దని త్రిజటపలికె వింటి 4

లంకవిభీషణుఁడేల, గంటిజానకిరామాంకముననుండఁ గలఁ గంటి । నింకభూసుతకుపలగొనుఁడీ మేలనుఁడీ, యింతినుడి విని మ్రొక్కి, చెలులునిద్రించిరలజడి । పంకజాక్షిసీతశ్రమచేత

వడియెలుంగ త్రియెత్ర్ఫఘుంగారు ంబునం। గొంకకేసరి శేషగిరిరాముం డభిలాష, గొనిగాని దేము పవనితన్యజించనూహించెను వింటి 5

4 నాటకురంజిరాగము - ఆదితాళము

పల్లవి — వినుర నరచరితె, తముపార్వతీ, వినుతమేచకా, కృతీ

అను — హానుమంతుండు జానకితో భాషింపంగ, ననువాతటి యిదియనితాంబలికెను విను

మనువంశ్యుండుదశరథుండనునృపుండేలం, దనరునాదౌర, కునవిక్వాకు। తనయులు రామలక్ష్మణభరతశత్రుఘ్నులనువారలు రాముండగ్రజుండానలువురకు। జనకాజ్ఞనడవికేంగి సీతాలక్ష్మణులతోం బంచవటికుండ రావణుండుసీత। నినకులులనువంచించి, కొని, చనెనెంకెజటాయువుగాంచి। జనపతింజూడనిన్ను సుగ్రీవుచెలిమిగనివాలినీగిటంచెననెమూనుత విను 1

వైదేహినరసు, నాల్గుదిక్కులకు, వానరులను, బంప గొంకరము। మాడెనడెనంగ, ద్భుతమందునే, నీవారిధిదాటి లంకంజొచ్చి చెరింగి। నాదు భాగ్యరమయనశోకవని నవ్య శింశుపా, తరువుక్రిందనాతల్లి। నిదేవతానుతల్లిం, దనునింగిత హైరణ్మయపల్లి। నే దర్శించితిసీతననుమాట, మేదినీసుతవిని సుహాద్భుత మొందెనెద విను. 2

మిన్నుమ్రోంతయో, పవనునిపలుకో, కన్నకలయో, నేనురామకథ। యెన్నాళ్లకువింటిగర్ణామృతముగ, నెన్నండు నిద్రలేదు, కలగాదు, సత్యమైతేను।కన్నులయెదుటప్రసన్నుండౌ గాకనిన, మ్రాను దిగివచ్చిసీతకుమ్రొక్కి। పిన్నపిచ్చుకంతటి వాండై విన, తారుణముఖుండైయచటివా।రెన్ననంజనీసుతుండ

శేషాచలేశుఁడైన రామునిదూత నేన నేను విను 3

7 శహానరాగము - త్రిపుటతాళము

పల్లవి —వినవేయాననజితచంద్రబింబ, హేరంబ జననిపరసరస గుణమణినికురుంబ.

అను —జనకసుతచింతతను పొందిన హనుమంతునిగని రావణునిమాయలనిబలుకక యుండె వినవే

తల్లి నేమాయకుఁడగానానంద వల్లిగుణములపాలవెల్లి । నాయంకరమరలుమానుమిఁక నునింత సేయఁ । జెల్లా, నాకోసల పురీధాముఁడై తగు, నల్ల శ్రీరామదాసుఁడను మారుతసుతుఁడ। నల్ల, సుగ్రీవుని మంత్రిని నేను ।కల్లగాదంచునంజలియొనరించు, కపిఁ జూచి నరవానరుల కెట్లుపొందదగునని సీత వినవే 1

మాయమ్మారావణుఁడునీ గొనిచనిన, చాయవెదకుచున్నపుఁడు । బోయ, చెలిచేనీతెఱఁగువినిపంపకడన్వేసింప । రాయ, భారమంపెనను సుగ్రీవుఁడుచటికి, బ్రహ్మచారినై చని వారలయభి । ప్రాయమెఱిఁగి రాకొమరులఁదెచ్చితి । ఆయెనర వానరేంద్రులకు చెలిమిఖలుఁ, దావాలినిరాఘవుఁడుజంపెనని నంజనీసుతుఁడు వినవే 2

మాతనిన్నారయఁగపులఁబంచి నీచేత, నన్నియునగును వాతాత్మజమనలక్ష్మణులమేలునా సేమము దెల్పి । సీతా,పతికిమ్ము ముద్దుటుంగరనుని హరియొసఁగెఁ, జేకొని । ప్రయత్నమునఁదెచ్చితి, నృపతి । చేతిముద్రికయనిసీతకతఁడిచ్చెను । ప్రీతిచేఁ గొని శేషాద్రీశుఁ డౌ, రామవిభునామాంగుళీయక మాదలఁ దాల్చెను సీత. వినవే. 3

యదుకుల కాంభోజిరాగము - అటతాళము.

పల్లవి — రామదాసుడవౌ నీవు హనుమంతా, రావయ్యా యనేకాంతా.

అను — క్షేమమా సూర్యవంశాంబుధిపూర్ణ । సోముడైన శ్రీ రాముడు, ఆలక్ష్మణుడు రామ

ప్రాణదాతవు జగత్ప్రాణకుమారా భూనుతవిహార పుణ్యవిచార । మానితకల్యాణ క్షేమధాకార మహితానంద సారా। కంటివా నాయుడుములు, భూనాధుని కయ, తానామనవి పవమానాత్మజ దెల్పు । మానాధు నేనాడిన మాటల, కలగవ నిననా నుఅందితో । భానుసన్నిభునితోఁ దెలుపుము, పరమ ధార్మికతిధారుణి, విలసిల్లుము రామ 1

గడువు రెన్నెలలదాఁ, కాహరిరాకున్న, చెడుగురాక్షసులు భక్షింతురునన్ను ఆ । రడి సేయు రావణుని, మడియించి, జయముగొన్న । కడుకీర్తియునవన్న, పతితోఁదడవువలదని । నుడువు కరితురంగ మడు వుఁజొచ్చిన, వడుపున నులంక । నడిజొచ్చి దానవుప్రచ్ఛియు, వారత ఖగేంద్రుఁడమృతముఁగొను। కడఁక రాముఁడు నన్నుగొనిచనఁ, గాబ్రయత్నము సుయత్నముగఁ జేయు. రామ 2

నాచేనీయునికివి, నృపుడేసానుజుఁడై, రామాలివచ్చి రావణుఁద్రుంచిఘనుఁడై । యేచియయోధ్యకు, నిదెనిన్నుఁ గొనిచను, నింద్రాదిసురనుతుఁడై, అనవాచాలకతనిట్లుచాటెద వబ్ధి,కీచయవారెట్లుదాఁటుదురనిన। ఓచంద్రముఖిరాఘవుల,సా, మూఁపునవహించిదెత్తునిటకు । నాచేతికానవాలిచ్చుని, వను నమ్మినెమ్మి మాడామణియొసఁగె రామ 3

శ్రీరాముఁడొకనాఁడు, చిత్రకూటగిరికోరి వాఁగొంగ్గపై గూర్చియున్నతఱి । మీఁటియొకకాకియా, మిష గనిన్నాకాలి బొటన, వ్రేలుఁజంపెను గ్గరిని వ్ర । దీనిమారీచ, వైరి కాకిపై, పూరిమంత్రించి, కేరియేయశరమై । గారింపముజ్జగముదిరిగి, కావుమనిరామునివేఁడఁగ । న్నీరునీరసముగా, నినక, న్నిచ్చిచనె నదియొకసేయుము షటికి రామ 4

చిఱుతవిరిక్కసుల చిక్కుఁబఱక జడగ నెట్లగుననిన, జననిసూనకేక । యొఱఁగవుమిన్నంది, పెరిగెనిభయముపడక, వీక్షింపునికటక, తెలియ । హరివిగుడదాల్చె, నరివీర భయంకరవి, గ్రహము శ్రీహరివిష్ణుఁడు త్రివిక్రము, శరీరమును ధరించు తెఱంగునధరణీధరాభమగుసీతను । నరయనాతరమె శేషాద్రీశ్వరునిర ఘవునిజేరఁగఁజనుమింకను రామ. 5

9 సారంగరాగము - ఆదితాళము.

పల్లవి —రఘుప్రవరుచరితము, రాజముఖిసఖివినవే

అను —అఘప్రహారయా హనుమంతుఁ, డవనిజాతకునమస్క
రించివన । విఘట్టనమునకుఁగానికాదుసుర, విపక్షునిసముక్ష
మనుచుఁ దలంచె రఘు

ఫలములుదుల్చివిరుల్ రాల్చితరు, పంక్తులుబడఁగూల్చి యళి। కులముజోపి పెరలు రేపివాపీ, కూపజలములయడుసుపై కిఁదేల్చి । అలచి త్తరువుమేడమరు త్తనయుఁ, డాగ్రహమునఁ దన్ని నేలఁగలిపిన। కెలమివారురావణునికెఱిఁగింపఁ, గెంలిలక్ష రాక్షసభటులఁ బనిచె రఘు 1

'దండిమగలుగండుమిగిలిరాఁగని, గుండెలగలనార్చిగదా। దండముగొనిఖండించెనగచరా, ఖండలుఁ డదివిని యమరారి

పేర్చి । నుండిపడిపంచసేనాధిపతులుఁ, జండకోపకాండచాప ధరులై । దండనాథులేవురారాఁగవిజము, దండకనిచెవారి రావణుండలికె రఘు 2

దశముఖుఁడు సప్తమంత్రికుమారులఁ, దగువీరులఁబంపవా । రసమశూలభిండివాలకరవా, లాదిసాధనములనవిలజునొంప । నసమానబలాఢ్యుఁడై యేడ్వురను, గసిమసంగితోరణస్తంభమున । వెసనుండెహనుమంతుఁడవలనవిని యసురేంద్రుఁ డెక్కుకుమారునవిచె రఘు 3

కరులుహరులునరథములుభటులుసం, ఖ్యాతము లేలేర, బం । ధురకృపాణతనుత్రాణసబాణతూణధనుర్ధరుఁడై యేపు మీఱ । నరిదివీరుఁడునేఁగియక్షుఁడు, శరములనొంపమారుతి యలిగిము । ద్గరముచేత్రేసియతనిఁజంపినై, న్యమును ద్రుంచె రావణుఁడదియువినె రఘు 4

కనులనశ్రుకణములు నెలుఁగున గద్గదికయడరఁగాను రా । వణుఁ డింద్రజిత్తు గని గజిబిజిగా, వానరుఁ డొకఁ డింతఁ జేసి తేను।కని సహించుటెట్లు వానిఁ జంపెద, ననిన దేవనీవు బోవ నేటికి, ననచరునిఁ బట్టి దెత్తు నిచటికని, చనియె మేఘనాథుఁడు సేనతో. రఘు 5

వాలు బెలుకుగదవిల్‌తూపులవ, జ్రాల జోడుదాల్చిర । త్నాలసౌరు దేరు తేరుధీరో, న్నతి నెక్కిచనినామీరినదల్చి వాలమ్ములెదెనిమిదాలునొకటి, ఫాలహృగయుపదవాలమునననుర । గిలింపఁగనలిగరుడుఁడననెగసి, కీశవిభుఁడుగూల్చెరథరథ్యములు. రఘు. 6

ఎంతవాఁడవీఁ, డని వేటొకతే, రెక్కి బ్రహ్మాస్త్రము

దనుజ। కాంతుఁడేసియంతడాపియతిధీ, మంతుహనుమంతుబంధించెక్షణము। సంతతమెవనిఁ బేర్కొనినజనుల,జ్ఞానకర్మబంధములూడిముక్తి। గాంతురట్టిశేషగిరీశుఁడగురా। ఘువదాసునికితరబంధములెంత. రఘు. 7

10 గుమ్మ కాంభోజిరాగము - అటతాళము

పల్లవి — నారీమణీవినవే యాకథాసరణి నారీ.

అను — ఆశాఖ సేశ్వరు పట్టి ట్టి। తేరఁగట్టుఁబడి చ్చువానియ।
ధీరాత్మునిఁ బెరుగఁబరము గనువాని వీరహనుమంతు గ్రుద్ధమఁ।
బాహుల చేరిరా, బ్రహ్మాస్త్రమొక క్షణముతనువంటిచనట।
వీరుఁడెట్లిఁగియుఁగార్య గౌరవముచే। నూరకజనిమెఁ బేరోలగమున, నున్నదనుజవిభునెదుట రావణిడియుడె నతని నారీ.

ఘనిబ్రహ్మాస్త్రముగఁ గట్టుబడెవీఁడు, మానుల విఱిచె। వీనిచే దనుజుల్ శాకాకులుగాలి, చేనొరలుగతిఁబడిరనేకులుశాస్త్రి। వీనికెయ్యదియో వివేకులుజెప్పిన, దానిఁ జేయుఁ బుములోకులుమెచ్చ। గానీవనిన, సుతుమాటలంకా, జాని, వినిప్రహస్తుఁడనుమంత్రుల। జెనిజూచి పలికెవీఁడెవ్వఁడో, తానిచ్చటికి వచ్చుటేమోక్రీడా। కాననముఁ జెఱుకుటేమో సుభటులఁజంపుటేమో యూవానరుని,యడుగుసున నతఁడటులనేయడిగినవనచర। నేనువిడిపింతునిన్ను భయముమాని, నిజమాడుసభలోన నె

రావణాలోకత్రయవి, ద్రావణవిన, రోరి, సకల। జీవహృదయస్థుఁడై మీఱిదేవ, దేవుఁడౌ శ్రీరాఘుశౌరిపాద। సేవకుఁడను రాసురారిమారా, మానవేంద్రునినారీమణిని। నీవుశునకము, హావిస్సుగొనుగతిఁ దెచ్చి, నావుఇట్లా, యేలరాచెడిపా। య్యేవుఢంకనాబుద్ధివింటే బ్రతి, కేవు,రఘుపతి,ఋష్యమూకము

నసు! గ్రీవుఁడనుకపిరాజుతోఁ జె, లిమిచేసియొకతూఁపున! నేవా
లిఁజంపి కపులకుఁబతిని జేసిరవిజునికపి దేవుఁడవనిజనుజూగనం
పఁ, గావచ్చితినిఁ బవనజుఁడనని నారీ 2

కంటి, రాతమ్మికంటి, సీతనునేనీతోఁటఁ, గూల్చితికొం
టుచేష్టగ్ కోఁతినౌట చంపెద!మంటవచ్చిచస్తేనే,పూటాలన్నిటి
కంటెమెప్రియమనుమాటవినవే! వింటి, నీకొడుకు నన్ను
సాధించె, సంటపొంగినావు భ్రష్టప్రము! యొంటనంటి చనె
నీకుప్రియముజెప్పి, నంటబంధునివలెదయచేవచ్చితి! కంట
కపుమతిత్యజంపుముజ, గముగతివిచారింపుము! బంటకొను
మెఱుకనదిముక్తికము, పౌలస్త్యకుల నీ! వంటివాని కసురత్వ
ము తను, వాత్మగానెన్నుటననెనతఁ... నారీ 3

మేనుకంటెను నేనన్యుఁడనియెంచి, తేనిపరాపరమైనవస్తు
వాదువు! గానీకరయఁ ప్రాణబుద్ధీంద్రియదుఃఖ, శ్రేణిలేగజ్ఞా
నమెమూలమని! దీనితెలిసి తేనీకుమెలుకడ, లేనిదీవిగతిగాను
తనువు! లోనీవున్నావంట, యేనుతనసంసృతిబంధమగునది!
మానుచిన్మాత్రుఁడనజుఁడనఘుఁడ నేనుఆనందస్వభావుఁడనన
రా! మేనుప్రాణముమనసుమతిమొద, లౌనివిభూమిమరుద!
హామికప్రకృతివికారజాతము, లానందెనయెడునిరభి! మానిని
రుపాధికుఁడీశ్వరుఁడు, తాననియెఱుంగఘనుఁడగునని నారీ

దశముఖసావధానమతివైయొకటి, వినరాముక్తి! వెస
నబ్బుహరిభక్తి, గనరా,దాన,నిశితజ్ఞానముగల్గిమన రా,జ్ఞానా!
భ్యసనముననుసోహమనరా, దాననసమానభవముచేకొనరా!
యోరీ!దశరథాత్మజుఁడుప్రకృతికంటెనుపరుఁడుబిసగుహాశయుఁడు
విష్ణుఁడుశ్రీదేవి! వసుధాపుత్రియాచెలిమున్నిడుకొని, రత్న

సమూహముతో వచ్చియిచ్చిశరణను । వెసనీవెయపరాధినసుమ
తేఁ, డు శరణాగతప్రియుఁ । డొసఁగభయము శేషగిరినిభుఁడు
అనిపవనసుతుఁడన్న । తనమానముగఁ బల్కు బల్కుఁ, కసు రేం
ద్రుఁడలిగినలిరేగెను నారీ 5

11 కర్ణాటకిసారంగరాగము - ఆదితాళము

పల్లవి —తరుణీయాచరిత్రము, సరణిసుజనాదరణీయము
అను.—ఇరువదికన్నులను రోషానల మిరవై ప్రజ్వరిలను రావ
ణుఁడు । హరిదాసునిహనుమంతుఁగని వనచరాధమానిను
ద్రుంతుసీతను నధింతు । తరిమి రామలక్ష్మణుల సరిమ్రుఁజంపి
కపికులాగ్రణుల । తరణిసుతాంగదాదులఁ బోరిగొందు,ధరణి
యందుయశము గందునని యెను తరుణీ

నూరుకోట్ల రావణకీటములునా, తోసమానమాసురారి
నేను । శ్రీరామదూతనై నీరాటినానునా, పేరు హనుమంతుఁ
డొకసారిగ్రద్ది తేను, ఓరినీపనిదీఱునీవునీ, వానునా కెంతమాత్ర
మురా దోసకారియని । మారుతిపోనాడవినికిన్కచే నారాక్షస
చూడామణియాతిక్క । దారికోఁతికంపలు తెగవ్రేసిభూ, తము
లకు బలిసేయుఁడని పెలపియుఁ । జేరిజంపఁగఁడఁగెడు భటులని,వా
రించి తనయన్ననుగని । సారభాషణు డైనవిభీషణుఁడు, చారు
లెందు నవధ్యులందురనెను తరుణీ 1

వానరుఁజంపుట, పాపముదిగాక, వార్తలెవరు దెలుపు,
వాడు వీని । చేనింతయువినిరాఁగోరు, శ్రీరాము, భూనా
థునితోఁ బోరు, వేవేగ, మేనీకుఁ జేకూరునో, దాన వేంద్ర వీనికిఁ
దగినశాస్తి మీరు, సేయుఁగానియమింపుఁ డనఁ దమ్మునినుడి, తా
నెదనిడి రావణాసురుఁడుకపులప్రాణపదముతోఁకయదికాల్చివీని

పోనిండనిపల్క, దనుజభటులు న్మాయనకనిలజుఁగట్టి, బహు,
వస్త్రచయము తోఁ గకుఁజుట్టి । నూనెలోనద్దివహ్ని దరికొల్పి,
యానగరమందుఁ ద్రిప్పి రేసుందు తరుణీ 2

పావనిచిఱుతోకను, నొందెనంత నెవకరైె, బంధముల్ ఘన
తనుఁడై తనవెంటవచ్చు। కాలఁద్రుంచియింటింటనిజవాల,
దావాగ్నిఁబెట్టిబూడిద పెంటఁజేసెపుర। మావిభీషణునిలువినా,
మంటతోఁగంటకి । పావనుఁడు దల్లినామనుగను,వలిచెలిసీతా స్తుతి
గంటగపిఁపతియావనధిలోలాంగూలము ముంచిచల్లార్చి, నేవిభు
నామముమాలము దెలిసినజనులు । పావనులెతా న్తయానల
ము, బాయుదురార దనుభటుఁడై శ్వానము। చేవేగ మెత్తత్క్ష
ణముజని, సీతాసన్నిధికిప్రదక్షిణము। గావించిమ్రొక్కి రామసన్ని
ధికి. దేవిసెలవిమ్మనినఁబలికెఁ గొమ్మ తరుణీ 3

నిన్నుచూచియూఱడియుంటిని, నేనెట్లునిచటనిర్వహింం
తుననిన । కన్నతల్లి మూఁపునధరింతురామునితో, నిన్నుగూర్చి
వినుతిగాంతుననినమ। రున్నందనునిభక్తినుంతుఁగని విను,నన్న
నేనేఁగనై నాప్రాణముల్ ధరింతునీవావా। రాన్నిధియింకించి
యైనబంధించియైన, రాముఁడువచ్చి యనిలోనపశించియుఁజంపి
నన్నుఁ జేకొనినఁగీర్తియందాఁక, మిన్నకుందుఁ బొమ్మా హరిఁ
దోడితెమ్మా । యన్న నాంజనేయుఁడు చనిసువేలాచలమెక్కి
యార్చెనువిని । యెన్ని రంగదజాంబవత్ప్రముఖులు ఇదివాయు
సుతునివిజయ నాదమని తరుణీ 4

తరుచర పతిచరణములూనినతరి, గిరిధరిత్రికిసరిగాఁగ్రుం
గి, యెగురు। తరిముప్పదియోజనముల్ నింగి, కెగసినా, గరము
దాఁటిఖగరాజుభంగి, మహేంద్ర । ధరణీధరమెక్కెనబ్బో

సామీరినేనరసికొఁగలించిరియంగదాదులు। చెలంగిపోయినపని। నెఱవేఱెనాయనినమీకృపచేఁగంటి, ధరణిజనని నడచ్చిన తెఱఁగంతఁదెల్పు । హరివీరులనిలజునికొనియాడిరి, యానందమున నాడిరి,శోకముద్దాడిరి। పఱచిమధువనమునకుఁజనిమధు, ఫలములడుగ శేషాద్రిధని। కరుణగలుగ ఫలంబుల కేమీయని,మరుత్సుతుఁడిచ్చె, సెల వెలమి హెచ్చి తరుణీ 5

12 నవరోజురాగము - అటతాళము

పల్లవి.—సరిగారీసచ్చరిత్రము వినువారి, కరయునెవ్వారిలను, గౌరీ

అను — శరుచరులమ్మధువనపాలకులనె, న్నిక తేనెలాని, ఫలములుగొనికాపరులఁ। జరణతలతాడితులఁజేసిన,వెఱచఱచి దధిముఖాదులుజని। తరణిసుతునకెఱఁగినభంగ,సరణిదెలిపిన నతఁడెనఁబొదలె సరిగా

చూచివచ్చెహను, మంతుఁడుసీతా, సుందరినుశి, నీవా మధువన। మాచెల్వమునఁజొచ్చిరనురవిజునిమాటహరివీనులలరవిని। నాచెవికిననిజఁబేర్కొనినట్లున్న, దనిననొనోనుహాత్మా। రాచకార్యమునెఱపిహనుమను, త్వరముఖులిదెవచ్చిరని పిలువవ। నేచనునంపఁజనిమిముఁగపి, నేతముదమునరమ్మనెననిరి సరిగా

మిన్నుముట్టియాడుచువానరులుమ,రున్నందనాంగదుల ప్రాపునరాము। సన్నిధిఁబెన్నిధి, గన్నట్లుగనిమొక్కె, రున్నతి మదిఁబొదల। చెన్నలరఁగంటిసీ, తనులోకమాతమీా, సేమ మరసెరామ। చంద్రరాజేంద్ర।విన్నపముశోకవనిజానకి, యున్నది కృశించిజడగట్టిన। పెన్నెఱులతో రామరామా, యన్ననుడి తోడనెమాఱుతి సరిగా 2

నేనుశింశుపా, తరుశాఖలనుండి, నీకథవివరించినవిని

భూపుత్రి । వినుఁ డమృతసమానముగాఁ బల్కు, వీఁడెవ్వఁడని యెంచిన । మానవతీమణి యెదుట వానరశిశువు, నై నిలిచి మ్రొక్కి నమ్మికఁ బుట్టునట్టుగా। పూని యాద్యంతములు తేటముగా నెఱుఁగఁ జెప్పి ముద్రికవిభుఁ । డానవాలంపిరని యొసఁగిన, నంది మిన్నందెన నేఁ బావని సరిగా. 3

ననునమ్మి మాయమ్మ పల్కరా, ముని కెట్లు నామీఁద దయారసము । జనియించు నట్లు విన్న,వించు నాయిడుములు, గనినవాఁ డవు గావా । అనిన రాఘవుఁడని, న్నడిగె పినది మొదలు, హా సీతా యని శోకించుచున్నాఁడు నేఁ । జనినీయునికి దెల్పనృపుఁడను, జార్కసుతయుతుఁడై కపులఁదో । డ్కొని వచ్చియరివ్రచ్చి నినుఁ జేకొనునంటిన నెనంజనీసుతుఁడు సరిగా 4

ఆనతి వమ్మరాముని యొద్దికననభి, జ్ఞానార్థముగఁ జూడారత్న మొసఁగి । ఆనాఁడు కాకముమది నెంచుటఁ దెల్పు, మనెనామినీతోడ । నేను నామఱఁది లక్ష్మణుని దుర్భాషల, జ్ఞానమున నంటినది శమింపు మని । ఆ నెలఁత కన్నీరు మున్నీ । రననించ నూరడించి ఘనో । ద్యాన మగలించి యక్షముఖదనుజుల వధించితి నసెనతఁడు సరిగా. 5

కొంకక రావణుఁ గాంచి భాషించి, లంకాపురి గాల్చి సీతాజ్ఞచేఁ । బొంకముగా వచ్చితి రామ నీ పాదాం, బుజములే దలఁదాల్చి । కింకరుఁడ దయఁ జూడుమని వాయుజుఁడు బల్కిన రాఘవేంద్రుఁ డానందసాంద్రుఁడై । పంకజభవాదులకశక్యము, పవనసుతనీ కేతగునీపని । కింకొకటిసాటిగాదని గది, యించెఁ గౌఁగిట రాముఁడనిలజు సరిగా 6

చక్రమాత్ముఁ డనేనా, పరిరంభణముదుర్లభముమినసామీాక్షి, యనెనెవ్వని। చరణాబ్జయుగళతులసీదళమ్ము లంబూజ, సలిపిన శ్రీమాీటి। పరమానందము, దురారాముని చేనాలింగి, తుఁడయ్యె హనుమంతుఁడేమందు। గరిమనధ్యాత్మ రామాయణ, కావ్యమున సుందరకాండమిది। చిరపితెనిఁగించె సుబ్రహ్మణ్యకవి శేషగిరీశు పేరిట సరిగా 7

సుందరకాండము సంపూర్ణము

శ్రీరస్తు

# శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు.

## యుద్ధకాండము

---

### 1 భైరవిరాగము - ఆదితాళము

పల్లవి — శ్రీరాజరాజేశ్వరీ గాంచ, రిత్రమూర్త్యనుతిపాత్రము

అను — చెలదాశరథి, మోదముగుది, మీఅదయాశరథి, వైః పలికె। మారుతిచేసినపని దేవతలచే, దీరందొరులతరమె నాగరమె। వ్వారుదాఁటువాకు లంక యె,వ్వరికిఁగాల్చిరాదీఱుసా । మీరి వలననేను ర కులము సౌ,మిత్రియు రవిసుతుఁడును బ్రతుక గలిగెననె. శ్రీరా

ఈ సుగ్రీవుని భాగ్యమహిమనుతి, యింతఁ దరముగాదు, లిసక్రాహి। వైనారణములకుపాదు, ఇదిదాఁట, నేసరిణినో నిఁకమీఁదు, రాఘ। ణాసుటఁ గెల్చియెట్లాసీతఁ జేకొన, నగునిదే టివాడు। మోసమామాయబలాయనినరా,మునిఁ గని ప్లవగకులా గ్రణిపలికె । నీసముద్రమెంత రావణుఁడెంత, యేమిటికీచింత గెలుపువింత।నీసరిలేరవనివిల్లుఁగొని, నిల్వనిన్నెదురనెవరివశము। వేసంద్రముదాఁటనూహింపరవు, వీరరావణునిమృతునిగదలం పుమనె శ్రీరా 1

వానరవీరులు కామరూపు లని, వార్యబలులు చూడు, నీపనికై యగ్ని। లోనైనఁజొరనున్నారు నేడనిభక్తి మానుషము తేర్పడనాడు భాను, సూనువాక్యముల, కలరియంజని సుతు

గనిపుడమిఁత్రేడు। నేనీచేలంకారూపమువిని, దానిపొంకమింకఁ జే తునన।భూనుత దివ్య తేజోధికమై లంకాపురి త్రికూటగిరిపై ను న్నదియొరపై । దానిచుట్టువారాన్నిధియగ, డ్త యగుకోటమణి హైరణ్మయము । పూని ధర్మార్థకామమోక్షముల, నానలరు చతుర్ద్వారముల నవె నతఁడు శ్రీరా. 2

తరణిశశాంకుల, పై విరోధమున, దమవారలకన్న, ము న్నాఅసెనన్న । కరణి గోపురములుమిన్నా, వరించెను, పరిగె లుగృహములనన్న మేల్ చి। గిరుపుకూటముల, మణికవాటము లఁ, దనరుసుప్రసన్న । సరసోద్యానములనడబావుల, చలవచ ప్పరములవరవిపణి। సరణుల దేవాలయములముత్యపు, సరులఁ దోరణాలఁదనరె శ్రీల।కిరివప్పరినిక్కిచూడలేఁ,డింద్రుఁడైననలు చక్కికరుల । హరులరథసహస్రములనెక్కి సక, లాస్త్రకుశలుల సురు లరియుదురనెనతఁడు శ్రీరా 3

రాజసింహమిట్లున్న రావణుబల, రాజనాల్గవపాలుహాత మయ్యెనాచే। జేజేరాపదివేలుప్రణతుల్, నేఁజేసెనన్నేలు బంట। నోజయశ్రీరమణయనినహరిహను, మంతునిమెలు। పూ జవాకుసుమములఁజేసిపూజవ, పుత్రుఁగనిసైన్యములనంపింపుమి। దేజయముహూర్తమని రాముఁడాన, తియఁ ప్రయాణభేరిమ్రో యించె శౌరి। అజితనయుఁ డనిలాత్మజు నెక్కె, నంగదుఁడు వహించె లక్ష్మణుని। ఆజి కగచరేంద్రపాలితకపిబ, లాళి యిల యీనుగతినడచె దక్షిణము శ్రీరా 4

తరుచరులెగురుచు బరువులిడుచురుచి, కరములయినపం ఙ్క్తదిని తేనెలాని। గిరులెత్తుచుఁబుట్టచెండ్లనానె, గరవైచుచుగో ప్పగుండ్లుదాఁటుచు। హరిమేమేదశాస్యుఁ ద్రుంతుమేఁగెననిర

త=నూతేండ్లు మతి రేఁబగలనక వింధ్య, సహ్యమలయాద్రులు ఘన కాననములును । ఉరువడిదాఁటెసి ర్క్యాటకకమర మ,కరఘుషో గ్రాభంగరంగ త్తరంగా । కరమైభీకరమైనరత్నా, కరముఁజేరి యాదౌరమైత్రిఁగని । ముగువుగ నిటసేనవిడియ నియమింపు మనినస్వామి మహాప్రసాదమనెను. శ్రీరా 5

ఆవేళసీతనుదలఁచి రాముఁడా, హాయనివిరహార్తినొందెనే మందు । నావిభుఁడు సత్యజ్ఞానస్ఫూర్తి ప్రజ్ఞానఘన కేవలానందమూర్తి, యోగి । కోవిదభావానువర్తినుకీర్తి, దేవతాచక్రవర్తి । శ్రీవిభు నెటిఁగినదుఃఖాదులు, చెందనేరవాగినా, ఘనునెనయునే। జీవాభిమాని కేదుఃఖజాలము, చిద్రూపమాపరమాత్మకు లేదుమా । భూమిమున కెశోకాదులునిదుర, వోవఁగలవెయెఱుకేకా, నిలిచెఁ । గావున శేషాద్రిపతిరాముఁడు సకలసాక్షి యనితలఁపవయ్యె బుధులచే శ్రీరా 6

2 శంకరాభరణము - ఆదితాళము

పల్లవి —వినవెమనవతీసతీ, వినయదయాదాక్షిణ్యలసన్మతీ

అను —హనుమంతుచేసైనదా, హాసము, గని సిగ్గునఁ దలవంచి
రావణుఁడు । చనదుసురలనేనైనని టుసేయు, నని, మంత్రులఁ
బిలువనంపిపలికె. వినవె

హితులారా కదనవిజితవిమతులారా ప్రభంజన । సుతుఁడుచేసినపనిగంటిరె, శూరతమిూఱఁ । గోతుకకలంకఁబ్రవేశించి భూ,సుతఁగాంచి యతౌదులఁబొలియించి । వితతమగులంకఁ గాల్చిగెల్చిచనె, వెరవేమిచెప్పుఁడనెదనుజపతి వినవె 1

ఓదేవా, గానముదితమ, హాదేవా, వలదుసీ । తాదయితువలనిభయముజగ,త్త్రయజయప్రభావా । ఆదేవేంద్రుఁజెలి

నిడె నీకొడుకల కాపతియళికిపుష్పక మొసఁగె। నాకరింపువగ ఱని యమునికి భయము నొందని దెంతనిరిహితులు వినవె 2

మయుఁడు బాలామణినీకొసఁగి, నయముచాలాగాంచె నీ। దయనుహనుమంతుఁ డిటుచేసెనని, దనుజలోకపాలా। మ యమునఁబకనేలకోఁతియని యే,మఱియుంటిమతఁడందున బ్రదికిచనె। నియమింపు మొనర్ప మిల నను ర్త్వగ, నిర్వాణర గానని రసురులు వినవె 3

నిదుర దేరికుంభకర్ణుఁడు, చదురుఁ జేరిమామాటల। యెదుటగాంచిరావణునిఁ దిలకించియోాదోసకారి।పదరియేపనిఁ జేసితివిదీన, ఫల మేమినీకిదె చేటుకాలము। చిదచిదాత్మకుఁడు రాముఁడు శ్రీహరి, సీతాసతి శ్రీదేవియనను వినవె. 4

రామసౌమిత్రులఁగపులసం, గ్రామభూమిఁ బోరిగొందు। సామినేఁగల్గినీమదికివి, నారమే మిా। శేముషీజతాగ్రజయని యింద్రజిత్తు నల్గ న త్తఱిని భాగవత। గ్రామణివిభీషణుఁడు శేషాచలకాంతాంఘ్రిలెరనిడిసభకుఁజనె. వినవె 5

3 కల్యాణిరాగము - ఝంపాతాళము

పల్లవి — కాళీ విను సుజ్ఞాన,జనమానసకాసార కేళీవిహార మరాళి

అను — మేలుగోరిసురారికోమలాంఘ్రులకుఁ, గేలుగదియించి విభీషణుఁడన్నమన్న। చాలఁజెందిసభికులఁదిలకించిదనుజే, శ్వరుడుకామాతురని గాంచి పలికె శ్రీ కాళీ

రావణామాకుంభకర్ణుఁడునీయింద్రజిత్తు మహాోదరను హాపార్శ్వులు। దేవామాకుంభనికుంభాతికాయులీ, దేవాంతక నరాంతకులు మొదలౌవీరులు, నిను। గావలేరారఘుకులేశ్వరుని

దారి, నీవు పుడమి వేళని నీ సీమ నుచుబలగాము । గావుగొన్నదివెర
వెన్న గాజితేగుసీత, నీ లెక్క బొంగావలెనా హరిశరణనె కాళీ 1

ఇనకులాగ్రణి బాణముల్ లంకాపురి, ఘనంబుగనిండి
రాక్షసు ప్రాణముల్ । గొనకమున్నె జానకిరాఘవునకొసంగ
దగు, కులగోత్రాకారులు నఖదంష్ట్రాయుధుల్ । వనచరులు=దు
పసుబలుల్ లంకఁ జొచ్చి, వారికగలంచకముచు రామునకుసతిజి।
మ్మనఘునీవు బ్రదుక, లేవుహరిసురేంద్రాదు, లాదరించినిను
హరించు రాముఁడెనె కాళీ 2

రాముఁడె నీహితమిత్రుఁడు వాఁడా, శ్రీలోకమునకేఁగినఁ
బోనిచ్చునా, యేలంచునిన్ను తమ్ముని హితోక్తుల, హితమా
యెనన్న కౌషధము గొనుమొప్పునా । మూఢనీచరగ్రాను శివిధవ
శుఁడై, యూరు ముఖవిభీషణునిగని యోరినేనొసఁగు । కామితా
ర్థము సమర్థత నొందిపోగనుఁ, గాలులాడుచు నైగుఁ బోగ
డెందనె కాళీ 3

కలిగినాఁడు విభీషణుఁడనుశత్రుఁడు, ఖలుఁడుకృతఘ్నుఁ
డతనితోఁ జెలిమి, గాంచగూడనాదాయాది, చెనగోరునను,
పలుకునిజమాయె నేఁడిఁ పలికిన బలిమి । కులతెగవ్రేతును
బగదీరనసుర,కులాధమానిను గాల్పనేయని దశముఖుఁడు । పలు
కవినిరోషమున విభీషణుఁడు నల్వురుమం, త్రులును దానెగసె
ను గదాయతభుజుఁడై. కాళీ 4

గగనమార్గమునందునిల్చి విభీషణుఁడు, గంభీరరవంబునఁ
బల్కెనురావణా । అగడుఁజెంది చెడిపోకు ప్రియవాగినై హితి,
వాచరించుననుదిరస్కరించితివట్టైనా, తగినదున్నఁ జేసితిసి ను
త్పితృసముఁడవు, దశరథతనూజుఁడై యవతరించెఁగాలుఁడు జగతి

రామరూపమెమహీ, జాతసీతయనఁగ జనించెనుజనకునింటన నె
నతఁడు కాళీ. 5

ధరణీభారముమాన్ప సీతారాములు, నలంచిరి విధి
ప్రేరితుఁడవై నేఁ। గలిపినహితవాక్యములు వినవై తివిప్రకృతి,
కరయసాక్షిభూతముఁ వెలిలోనుతానె। బెరయనానారూపనామ
భేదముల, భిన్నునివలెఁదరువులందనలుఁ దొకఁడై నీ।కరణిరాగవ
స్తుయోగమునరక్తస్ఫటి,కమనినట్లాహరిగుణాకరుఁడగునని కా

కాలమవ్యక్తముప్రధానపురుషులనఁ, గనాల్గుప్రధానపు
రుషులచేజగము। లీలఁదనరుభగవంతుఁడురాముఁడై సంహ,రిం
చునిన్ను నీవారితో నిదినిజమ్ము,బాళినేఁజనిహరికినేనుమునమ్రొ
క్కి, శ్రీలలరనుందుననివిభీషణుఁడువారల, జోలిమాలి, భ్రమ
లఁదోలిశేషాద్రిపతియ,శోవిశాలుని సేవఁజేయునపుడెచనె. కా

4. సావేరిరాగము - అటతాళము

పల్లవి —కామలీలాకాస్మ, కవిజయభ్రూలతా। ఖిలపావనసు
వ్రతా, హిమశైలసుతావినవే

అను —ధీమంతుఁడగు విభీషణుఁడు నలువ్వగుమంత్రులతో వ
చ్చిదివినినిల్చిరాముని। శ్రీమహితనాముని పాదనీరజాతము
లఁజూచినతుఁడై। రామారాజీవలోచన నాసామీవినుమ
నిపలికె ఘనముగను జెవులపండువుగను కామలీలా

నేవిభీషణుఁడనీసతినిమ్రుచ్చిలినట్టి, రావణుని తమ్ముఁడను
రామాఅన్న। చేవిడువఁబడితిగుణ, ధామాయింక నీవేగతి
ఘనశ్యామాసీతా। దేవిరామునికిమ్మని దశముఖునితోఁ, దెలి
పినఁజంపవచ్చెనురణభీమాఆ। దేవారికివెఱచినేవచ్చితినేనీ, సే
వార్థము దేవదేవదీనులకు। నీవేదిక్కనిననుడివిని,సుగ్రీవుఁడితని

నన్నుకువుమా। యావిపగతుని యనుజుఁడుబలియుఁడనఘ సెల
విమ్ముద్ద్రుంతు సచివులతో ననియె రఘుపతితో వినవె. కామలీ 1

ఇనకులమణిరవిజునిమాటవినినవ్వి, యనెనేఁదలఁచినమా
త్రమునజగము। లనుజగత్పతులనిమిషమునద్రుంతు,జననమొం
దింతు వేగమునఁదెమ్మా । దనుజునిసకలభూతాభయదానకంక
ణముగట్టితినే లోకమున, ననిన। జననాయకుఁ బొగడి దినవా
ధాత్మజుఁడో, యననావిభీషణనామునిదెచ్చికనుపింపఁ ।గని
మ్రొక్కి రామునిఘనశ్యామునివిశాలాక్షుని । మనోజముఖా
బ్జునిధనుశ్శర,మహితకరుని ప్రశాంతుని లక్ష్మణాన్వితుఁ బొగడఁ
దొడంగెవిను కామలీ. 2

శ్రీరామరాజలలామ మ్రొక్కెదనీకు, సీతాహృదయా
భిరామా । ధనుర్ధారిపూరితభక్తకామా శాంతా, కారాయ
నంతశ్రీధామా నను। సాకరము సుగ్రీవమిత్ర జేజేనీకం, జలిర
ఘువరనార్వభౌమాజగము । గోరి పుట్టింపఁ జేరిరక్షింపమీరి
శిక్షింపనీకితులకాది। కారణంబగునీకునతిత్రిజగద్గురుఁడవై తగు
నీకుజో । హరనాదిగృహస్థనగుసీ, కమితసాష్టాంగములుచేతు
హరినుత వాగ్ఘరియనెనువిను కామలీ 3

చరాచరభూతములు వెలితో వ్యాపక, స్వరూపమున
వశించియుండు । తెలుఁగరజ్జులుమాయనుంచియెఱుక, మఱచి
జన్మమృతులుగాంచియెపుడు । తిరుగుచుందురు శరణాగతులఁ
బ్రోవవేదేవ, దయారసమునించిసుజనా । దరణీయముగాదఘ
ధరణీధరలోకసరణికీర్తిరజతము కరణిభ్రమయని। యరయక
జ్ఞులుపుత్రదారగృహాదులందానసేయుచు విష । యరతులగు

దురితురనపశోక, కరము ఁగుసుజనుఁడిదిగ మవరదా పాలితద్వి దాయ నేను. కామ

నీ నేయింద్రుఁడీశానుఁడాద్యంత మైనది, గ్దవతలు నీ సఖువు కన్నసఖువు । నీవుగొప్పవుగొప్పకన్నద్రిభువ । నావళితలితంత్రి వన్నసీవె । నీవాదిమధ్యాంతరహితుఁడవు పూర్ణుఁడవు నీసవ్య యుఁడవు సుప్రసన్న శిరో । గ్రీవశ్రోత్రనయనవాక్ప్రేత్ర, ప్రేణి వజితుఁడవుమాయావాసనాసాక్షివి। నీవుద్రష్టవు శ్రోతవుగుణా, న్వితపంచకోశాతీతుఁడవు । నీవనాశ్రయుఁడవవికారివి, భావర హితుఁడ వాదిపురుషుఁడవు ప్రకృతి కవ్వలివాఁడ వనె కాము

మాయచేనిజరూపుమఱివిడి నరునివలె మహిఁజూపట్టి తినగుణిచుంచుననుని । నాయకునిగాననిలుచు, నుహితధీ యుతుఁడు మోక్షముగాంచు, గాన । నీయంఘ్రిభక్తియును నిచ్చనచేఁగందు, నీచిత్సుఖపుమేడనంచు యోగి । ధ్యేయసు జనవిధేయశుభనామధేయ, ప్రణతగాధేయనమ్బ్రోవుము । శ్రీ యుతాంగుళికునతియనినుతిఁ, జేసివవిభీషణునిగనిరనాయ కుఁడుహితముగోరుము, ఇపుడేమొసంగుదు దనుజకులతిల, కాయనిపలుకనగఁడుపొంగె. కామ. 6

నేనుధన్యుఁడఁగృతకృత్యుఁ కనైతినినుగంటినీదయగంటి బ్ర । హ్మానందము చేకొంటి జగతిలో నెవ్వఁడు ననువంటి ఘనుఁడు । నేనొల్లనతీసుతసంపదలుహరి నీయందే భక్తియుండ వలెనంటినట్ల । గానిమ్మనని సురజానికి గుదిమెచ్చి నేనెన్ను దిలోనినెన్నెనమ్మితినని । వానిమది, సీతాసమేతుఁడనై నిల్తునకు టిలుఁడవై నను, ధ్యానించుభవజలధిదాఁటుము, నన్నమీస్తవ ముదీనిఁబఠించు, నతఁడుకోర్కులుగాంచునని కాము 7

ననుగన్న ఫలమిప్పుడేగాంచుమీఁడు లక్ష్మణా లంకయేలిం
తుజూడు, జలము । గొని తెన్నభిషేకింతునేఁడుశిరుల, దనరి
దీవింతునీతోడుయెంత । నను కాచంద్రార్కులెందాక యిల
నాకథ యెందాఁకనుండు, నందాఁకవీఁడురాజ్య। మును జేయు
నటంచు మనుజేంద్రుఁడుబల్కి, నను జేశుఁ బట్టభద్రునిఁ
జేసెమంత్రులతో । ఎనచనులలరఁ ఎజుఁడాలిం । గనముచేసివిభీ
షణా రావణవధకు తోడుగమ్మని, ల్కినకీర్తినాంధ్రుఁ ఁగు
శేషగిరీంద్రునిసేవయొనరింతమనె కాము 8

5. కాపిరాగము - ఆదితాళము

పల్లవి—అళినీలకుటిలాల కాని । స్తులకస్తూరికాంకృతఫాల
ఫలకా, సఖిజవతిలకా విను

అను.—అలపంక్తికంఠుఁడంపశుకుఁడను నసురుఁడటువచ్చివిను
వీధినిల్చి । పలికె సుగ్రీవమహారాజ రావణుఁడునీ గరవు
మనినమాటలనెను. అళి.

మంచికులమునజనించినావు కపిమండలాధిపతివైనావు ।
యెంచినానునుజ, సమునిగానిను నెపుడునధముడఁగుడునకపోవు
మో । హించి రాకొమరునతి దెచ్చితేనీ, కేమిపురికేగుమిఁక
నీవు । మించినురులులంకఁజొరలేరెంత, మీరనిదశముఖుఁడు
దెల్పెననెశుకుఁ డళి. 1

వానరులానుడివినిపట్టికట్టి వానిఁగొట్టిన నొచ్చిరామా।
భానువంశాబ్ధిసోను దూతల, వధ్యులనకజంపెద రఘువీరాను
దయ। చేనివారింపు మనినన భయమిచ్చితి వెఱవవలగనెనురా
మ । క్ష్మానాథుండుకపిసేనశుకుఁడరసి మాదారతోనేపుంధుసి
నజయనె నళి 2

వాలిమాయన్న యెటులట్లనీవు । వధకర్తుఁడవసురాధమా । కాలమైనచ్చెనీకునకులము, గానినుజంపురాముఁడని తెల్పుమా, యనిలీలనాదిత్యసుతుఁడు బలుకవాఁడేగి రావణుని తోఁనుపను । శాలియై యదంతయునుదెల్పిన విషాదహృదయుఁడై యుండెదనుజపతి. యళి 3

అటుమీఁదట రాముఁ డబ్ధియుప్పొంగుటఁ గని కనులెఱ్ఱఁగఁజేసి । కుటిలభృకుటియైపలికె కనుఁగొనులక్ష్మణ ననగవక వారాశిది । కటములాక్రమింపఁగడగెవినిను । దను పంతుఁగపుల శ్రమముఁబాసి । చటులగతినడిచిపోదురుగాకని చాపమెక్కిడిమహాశుగముదొడిగె నళి 4

గగడవడఁకెను బుడమిదిశలవిసెఁ, గడలిదివ్యతనువు ధరించి । వడిగావచ్చినన్నములను రఘువరుముందరనుంచినమస్కరించినే । జడుఁడను శ్రీరామశుభనామ నాయెడఁదప్పులను మన్నించి । కడుదయఁగావుకావు భూతపంచకములకు జడిమ స్వధర్మమనిపలికె. నళి 5

నీవు నిర్గుణుఁడవవికారివిమా, యావివొ్రతటివిరాడ్రూపు । నీవంగీకరించి జగముల నేర్పునసృజింతువారనీవై పులో । దేవ నీసత్వమునసురులయిరివి, ధిప్రముఖులకునీవేప్రాపు । భావజారినికినుకచేఁబొడమెభవ్యగుణనాంద్రరాఘవేంద్రయనె. న

పుండరీకాక్ష మాయామనుజతనుండవనినిను దెలియఁగలదే । దండమేమూర్ఖులకుసన్మార్గమును పశువులకు మునుకోలవలెనేనికనీ । దండచేరితిదండమయాకో, దండధారియభయమిమ్మికనే । నిండుభక్తిలంకకుఁద్రోవయయిత్తునీకనుచు సరిత్పతివిన్నవించె నళి 7

రిత్తవో దీనుహాశరముదీని కిత్తతికి గురిఁజూపుమనిహరి । యొత్తిబల్కి నన్ను బాధించుచు నున్నారుఖలుద్రుమకుల్య మనుకరినా । మొత్తముపై వేయుమనిపల్కెను సముద్రుఁడు రఘువీరుఁడు నలరి । సత్తుగ శరము నేయ నాభీరుల, రిత్తఁజేసి యపుడె పోదిఁజేరెనది యాళి

చెలఁగి విశ్వకర్మసుతుఁ డానలునిచే సేతువొనరింపు మితఁడు । తొలుత నేనరముగొనెనిందుకని పలికిహరి కెరగిచనె నాగరుఁడుకడు । నలరెంత్కుణాకపీంద్రులతో శేషాచలేశుఁడగు రఘువిభుఁడు । నలునిజలధికిసేతువుగట్టుమని సెలవొసంగెనగ చెరులు హర్షించి. రళినీల. 9

6 సురటిరాగము - అటతాళము

పల్లవి —రామలింగా వృషభతు, రంగారాజితాంగా రామ.

అను —కామితప్రద సత్కరుణాపాంగా, కామగర్వభంగా గంగోత్తమాంగా రామ

అమరాచలచాప అజ్ఞానాంధదీప । శమనాంతకరూప సుగుణకలాప అమితప్రతాప । శమితనమజ్జనజన్మసంచితపాప, వినుతాంతకరూప విశ్వనిర్లేప. రామ 1

బాలేందుకిరీట భవ్యజటాజూట । శ్రీలసల్లలాట శ్రుతి చయఘోట, త్రిపురదావకృపీట । లీలాహాస నిర్మూలితనిశాట, శూలాయుధ ఖేట సుజన హేమకూట రామ 2

సోమార్కానలనేత్ర సుందరీజనచైత్ర । హైమవతీకళత్ర, సన్నుతిపాత్ర కామలతాలవిత్ర । సానుజాసురజైత్ర, సకల లోకసూత్ర, శ్రీమచ్చరిత్ర, శేషాద్రీశమిత్ర రామ. 3

తాంకిటతకతకిటరిమరిస రీతహాతఝుంరినుపధోత కుంద

ఝుంతాకి తధపధమప। తాహతకిటతక, ఝుంతారిస్సరిసరీ సనిసరీసనిధప, తాంతకట పధమపనిధ పమధళాంగు ధిమితక దధిగిణతోం రామ. 4

౫. బిలహరిరాగము - ఆదితాళము

పల్లవి —వినుసర్వమంగళానయనకళా, విజితాంబుజదళశంఖ సుందరగళా.

అను —ఇనకులమణిసేతువుమొదటనురా, మేశ్వరునొనరించి పూజించియే। మనుజుఁడు సేతుస్నానము, రామలింగదర్శన సన్మానము। గనుతేఁడుపంచమహాపాతకము, లనుజయించు నాదయనటంచుఁ బలికెను విను

నరుఁడుకాశికిఁబోయిగంగాజలముగొని। యురుదెంచిరా మేశ్వరునినభిషేకించి। బగువు జలధిలోఁబడవైవబ్రహ్మప్రాపుఁ జానని గాకరణి। తరణికులాబ్ధిసోముఁడు శ్రీరాముఁడుహర్షించి। దరుచరులుత్సహించి చయము రెట్టించి। గుగుగుంగతిదొంతరగాఁ బలుగిరులుగుతరగతిఁగొనితరలగా। అరుదుగ నలుఁ డందినాఁడు సేతువా, నరిచెనోజఁబదునాలుయోజనములిఁక విను 1

ఇరువైయిరువైయొక్కటియిరువై రెండిరువయిమూఁడు। మరునాఁడు మూఁడనాఁడుచతుర్థంచవా। సరముల శతయో జనములుకపులుసేతువు పరువడిగట్టిరిజూడుమహారి। నరిపరిసృతు లయిదా, శరధులుహనుమంతాంగదులనెక్కిమెబొవల। మెఱసి సువేలాద్రికిఁ జనికాం, చిరిపరిఘధ్వజతోరణమణి। హిరణ్మయప్రాకారసౌధగృహావరవిటంకమై తనరులంకపొంకము విను 2

పదితలలనుమణికిరీటములుంచి చెవుల స్వర్ణకుండలము
లు బెట్టిచేతులఁ । గదియరత్నాలకడియాలుగీల కొల్పి కలి
తాంగుళములనుంగరములు । పదిలపఱిచి ఱొమ్మున వేల్పుటేనుఁ
గుకొమ్ముపతకమైతనరార ఘనరుచి దేరఁ । త్రిదశులఁగెలిచిన బీర
ముతనపాదమునఁదగుగండపెండేరము । చదురనుత్తర గోపుర
ముమీఁద దశాననుండు కొలువుండె నిండుమనమున విను 3

పారాంతరము

చలువగొడుగులనీడ రావణుఁడుండి, శాలసౌధమునందు
యోధవరులతో విను

అపుడు శుకుఁడనుచారుఁడా రావణునిగని విపులమాననుజ
సేనకు కపిసేనకు । నెపుడుసంధిగాదు దేవాసురులవలె నిఁకనొక
పనితప్పుసేయకు । నృపకుంజరునకు వైదేహినిచ్చుటొండె జగడ
మిచ్చుటొండె రాముఁడు సుగుణాభిరాముఁడు । విపులాత్మజనే
బలముగొని వెఱునకదెచ్చితివా, బలము । ఇపుడుజూపునీసతుల
లంకరమియింపునని నీతోఁదెల్పుమనిపలికెనని విను 1

శ్రీరామలక్ష్మణులుసుగ్రీవవిభీషణులు చెలఁగినల్వురో
క్కచో నున్నారుచూడు । వీరెలంకనశింపఁజేయఁజాలుదు రితర
వీరులనేకులున్నా రెన్నుచో । సారమా ప్లవగసేనసంఖ్యసేయనా
తరమా, మేరుమందరతుల్యులు, యోధాగ్రేసరులు । చేరివిను
లంకకెదురై పలుమాఱుజల్పుచు ధృతికిఁ గుదురై । మీఱి
యూధపులు నూఱువేల్గొలువ, మెలఁగునతఁడు దివాకరసుతుఁ
డనిపలికె విను 5

ఇతఁడగ్నినందనుఁడు సేనాపతినీలుఁడు, ఇతఁడువాలికొడు
కంగదుఁడు యువరా । జితఁడు శత్రుహంతయా హనుమంతుఁ డీ

ఘనుఁడెన్నిశనీక్షించిచనెరామునికడకు। ఇతఁడు శ్వేతుఁడురంభుఁ డితఁడుశరభుఁడుపనసుఁడు। ఇతఁడుమైందుఁడుద్వివిదుఁడు యోధాగ్రసరుఁడు। ఇతఁడ విశ్వకర్మసుతుఁడునలుండీ, బలములెన్న లేఁడీశుఁడు। అతులశౌర్యులతిబలాఢ్యులందఱు,చతురులసురవధకు ననుజవర యనియెను విను. 6

ఇరువదియొక్క వేలకోటు, లిరువదియొక వేలశంఖము। లిరువదియొక వేలబృందములు సుగ్రీవునిమంత్రి। వరసేనలన్యుల బలములెక్క పెట్టనా, వశముగాదు, రేయుఁబగలుఁ। బరమాత్ముఁడాదినారాయణుఁడురాముఁడు, పరాపరశక్తిభూపుత్రిలోకజనయిత్రి। మఱివారివలనజగముసం, భవమాయెవారితో వైరము కొఱగాదఖిలమాతసీతనీవు। గోరితెచ్చుకొనుటకార్చిచ్చు తెఱఁగనె విను. 7

జలబుద్బుదమువలెఁజంచలముసంసారము, క్షణభంగురముకాయము, పంచభూతముల। వలనైపంచవింశతితత్త్వాత్మకమైజడమై, పొలుపొందుబట్టి తెలియమాయము। ఇలనెవఁడు దీనియందుమమతసేయు, మలమూత్రాదులగంపగోతకొంప, హాంకృతితెంప।నలుపుతెమిటికికలుషముసుఖా। దుఃఁజెందునేది యది దేహము కలుగక ర్తవనుటజీవునకుజ,న్మలయంబులటు గానమతలణఁపుమనె విను. 8

అతిశుద్ధమతినిర్మల, మాత్మవిజ్ఞానరూప, మచలమవ్యయంబుస్వజ్ఞానమున। వెతఁజెందిజీవుఁడుమో, హితుఁడౌగాననీవుస, న్మతిచేనాత్మనరిశంబు। నుతియింపుదారపుత్రా, దులయందువిరక్తిఁజెందు। సుతుఁడవువిశ్రవసునకు, సుఖముల్సతమునకు। క్షితి సుతరామునకిచ్చి రాజీ, వాక్షుని మఱుంగుఁజొచ్చి।

బ్రతుకు మిల శేషశైలపతి, భక్తిరావణాయనిబల్కెై శుకుఁడా
యెడనిఁక విను 9

8 అసావేరిరాగము - అటతాళము

పల్లవి —పౌలస్త్యబ్రాచరితము, పౌలఁతీతిలకింపవె

అను —లలితములౌ శుకుని, పలుకులువినిపది, తఁలవాఁడలిగి
శిక్షవలెనై వానితోఁ! బలికెఁ బ్రియమాడి బ్రతికెడినీవు, సిగ్గు
లేక జగత్ప్రభునినను బోధింపవచ్చేవు, ఇపుడెచంపుదునిను।
దలఁపవధకర్హుఁ డవుగావిఁకఁ, దలఁగిపోమూఢుఁడాయనవి।
హ్వాలతచేఁజనె శుకుఁడుమునుబ్రాహ్మణుఁడు వానప్రస్థగతి
నుండె పౌల.

సురలకుమేల్ కీడ, సురులకుఁ జేయఁగసరాశుకుఁడు సేయు
జన్నములు జెఱుపవజ్రదంష్ట్రుఁ। డరయఁగనొకనాఁడా,ధరణీసు
రునిడాయనగస్త్యముని। యరుదేరఁబూజించియతఁడారగించి
పో, మ్మనమునియొప్పిపాయనాన్నముసేయ। తరివేచివజ్రదం
ష్ట్రాసురుఁడగస్త్యుఁడై వచ్చి, తగమాంసాన్నము వేయుమని
వేఁడిన। త్వర ఛాగమాంసమువంటకముఁజండిరి, మునీశ్వరుఁడు
భుజింపనయ్యెడవచ్చి కూర్చున్న। తఱిశుకునిభార్య నావేశిం,
చిరక్కసుఁడు మానికి। నరమాంసమిడిచనియొభ్రమియిం, చి
కూడుకూరలుముని। వరుఁడరసిమనుజామిష యోగ్యమిది పెట్టితి
వనిశపించెన। సురవగుమనుచు నెఱుఁగననిశుకుఁ, డరువఁగా
ధ్యా, నించిమునిపలికె పౌల 1

అవిచారముచేని, ట్లయ్యెనానుడిదప్పు దనఘుత్రేతాయు
గమున, రావణుఁజంప। రవికులమునహరి, రాముఁడై పుట్టినీ,
రధిగట్టుసమయమున, దశముఖుఁడంపఁ। దవిలిదూతకృ; త్యా
మునకుఁజనిరాముని, దర్శించెదవుముదమున, నకలంకమా। న

వనీసురత్వముని, కబ్బునిచ నెంగుంభ, భవుం సుశురుండాలిధము న, సద్ద్విజుండయ్యె । నవ మారాత్మమహుం డగుమాల్యవం తుండు, సవినయముగ దానవవిభుని గనిరాక, అవనీసుతపురిం జేరి, నదిమొదలుబిర్చి నెత్తుమలోన, నెవినాశకరములై మే ఘములు, గురిసెనెత్తుకజడి శివలింగములు రోదనముంజే, సెడికరుల కొమ్ములూనల్లనై, నవియూవులి నెఖరములంగని, గని సెనెలుకలుపిల్లితోననియె. పా॥ 2

ఒకవింత గనజేంద్ర, యొబోడిసుగవాండూ, రిక నిల్లిల్లు దిగుగునిర్భయముగ, నికరసంస్థాపనగ, వివరముదెలు చుచు, నిక్కువముమనుతె, అంగువినుసీతను, సకలేశుండగు రాము, చంద్రునకిచ్చినా। చ్చికవచ్చినీసుటుగుంజొచ్చితినను। అకు టిల కరుణాఘ్యుండై, నిన్నుగాచు శ్రీహరిరాముండై పరంగు, ననిత స్త్వము । ప్రకటముగామాల్యవంతుండు దెల్పరో, మునిపా యితలోచనుండై రావణుంపు మా। టికిదిక్పతులం గెలిచినానవనీ దేవమునిగూపుని । ఒకపేనమానవుని రాఘు, వునిశరణొందు నాఖ । న్పకలంచములురిపులచేంగొని, నాపెమోగాన పొగడ దెవరి, నింకబుద్ధిగాదుడుగుతాతని, యెంచినాను పొన్నునిన నలంకరిగ పా॥ 3

రావణాసురువై భవముంజూచి, రాముండు లక్ష్మణుని చే విలుగొనియర్ధచంద్రాస్త్ర, మావింటదొడిగినిండారదీసియేయ। నదియసురాధిపుపైంజన్నియొక్కటి పదినూ రై వెయ్యైసంఖ్య లన్ను గడచి, పదితలల కిరీటములు బడగొని వెలిగొడుగుల । వేవేగద్రుంచి యవలీలంబొదింజేరెశర । మావేళదనుజాగ్రణి, సిగ్గున గుంది। వేవేగనంతఃపురావాసమున కేంగిధీవరుల వెరవరుల

రావించి, భావించి । లావునిర్భయముశరోత్సవముస్వాపైదయ యుఁగళ దేవీరులకు వారలాహవము, సేయఁజనుఁడుసదా । జ్ఞావిముఖులరణభయులఁబేఁచను, ఇంతునన శేషాచల । దేవుఁ డగురాఘవుని చేసనిఁ డెసినమెలనితలంచిరందఱును. పౌ॥ 4

ప్రథమయుద్ధారంభము.

9 నాటరాగము - ఝంపతాళము.

పల్లవి —గారీవచోజితశారీవినుశ్రీమిాజి.

అను.—గారు, లైయనికిదివిజాగులేఁగుచోరణ । భేరీ, మృదంగముల్, పృథులశంఖారవముల్ । వారక మ్రోయించి మహీషఖరహరికరి, వాహనములనారోహించి,ఘన । వైరి భయకరరవాలగదాశూలభిండి, వాలచాపములు, ధరించి యాయుతంబైరి గా

అటకుమున్నేరాఘు, వాజ్ఞచేవానగుల్ । పటు ఘోష భీషణ, స్ఫుటశౌర్యలైనాహా । విటపముల్బలుగిరుల్, బెక లించికొనివచ్చి।కుటిలరాసణబలము, గాలురాముఁడు గెల్చుఁ। జటులజయమొందు లక్ష్మణుఁడీవజుఁడరినోర్చు । నీటుజూడుఁడ టంచుఁదలపడిరయులతో, నేపుమిారికరణమొనరించునా।ర్భటుల హనుమదంగదనీలకుముదశర,భనలజాంబవత్సుషేణాదియోధ వరులు గారీ 1

లంకవాకిళ్ళని, లావుమైకపులుని । శ్శంకనసురులనఖా (స్త్ర)ములవిదళించఁగా । బింకములుదనుజులె, మ్మెయిఁబల్కిన లిరేగి । పొంకమహాపురద్వారములవెడలియసితోమ । రాంకుశ శరాళిచే, నగచరులఁగిలించి । అంకెలువైవఁగనిప్లవగులహేతుల బీ, రంబగంచిగాజితస్థలినిబహు । పంకమైమేదోమాంసరాశి

నెత్తురు, దంకలై పఱచెమహాద్భుతముగనయ్యెడను గౌరీ 2
మరలిదితిజులుకరుల,హరులఁ దేరులసతి। త్వరగఁబురికి
ల్పినం, గరకేళిసల్పిర। త్తరివనేచరులున, ట్లనఁ బేర్చిరిజయే
చ్ఛగ।తగుచరుల్ రామభ ద్రదయార్ద్రదృష్టిచే। నెరపుబలము
నుగల్గివెలసిరమృతముఁగొనిన। సురులవలెరావణా, సురుఁడలసీ
తాచోరుఁడైనపాపమువలననిశి। చరులు, దొరలుదరలిరిలఁజతు
ర్థాంశశేష, సైన్యములుబఱచెభయకృతంబులయికలఁగి గౌరీ.
తనబలములిట్లాటఁ, గనికనత్ప్రకుపుఁడై। ఘనుఁడింద్ర
జిత్తుమే, ఘములలోడాఁగిక్రూ। న్నవశితాశుగవితా,నములోలి
వర్షించెఁ। వనజసంభవునివర, మునఁగన్నబ్రహ్మాస్త్ర। మున
మర్కటానీక, ములనెల్లఁబడనేసె। నినకులమణికోదండదీక్షా
గురుఁడ, య్యనుబ్రహ్మాస్త్రమునుమన్నించి, త। క్షణమూరక
యుండిసర్వబలములుగూలుటరసి। యనలసన్నిభ, జ్వలద్భయద
నేత్రుఁడయ్యె గౌరీ 4
ధనువుఁదేలక్ష్మణా, దనుజుభస్త్రీకరిం। తును బ్రహ్మ
సాయకం, బునఁజూడునాబలం। బనిశేషాద్రిపతిబ, ల్కినవాఁ
డుజననంత। వనచరులుపడుటఁగనుఁ, గొనిరాముఁడంలియో।
హనుమంతక్షీరాబ్ధి, కావలదివ్యౌషధి। జనకమగుద్రోణనామ
గిరి గలదదివేఁ, గొనివచ్చికపుఁబ్రోవు, మనఁ, బావనిజవ,
మునఁజనితెచ్చి, వనౌకసులసజీ, వనులఁజేసినగముమున్పటిచో
నిడివచ్చె గౌరీ 5

10 ఆరభిరాగము - ఆదితాళము

పల్లవి —సారదయాధురీణసంగీతవిద్యాప్రవీణావినవే
అను —ధీరులైనవారలుచెలఁగిభీక। రారవములనుఱంకెలు

వైచి। మీఱినదివిని రావణుఁడు మదిని, నారసినందురి రాముఁ
డునాకెన్న దేవతానిర్మితుఁడైనవైరి । పోరనతనిఁజంపయూ
ధపులెల్లఁ, బొండిటుసేయని వా,రిఁ జంపుదున నేను నార

రావణానతిసబలులై చనిధూ, మ్రాక్షయూపాక్షశోణి
తాక్షమ। హావీరమహాకాయప్రహ, స్తాకంపనమహోదరమహా
పార్శ్వులు । దేవాంతకనరాంతకాతికాయ, త్రిశిరప్రజం
ఘకుంభనికుంభు । లావనచరౌఘము, తోఁదలపడిరా। రావీ
రియద్భుతరౌద్రరసములే, మనందగు గదా ముసలాశుగతు ।
రీవిశేషసాధనాళిచేవిన, ళించిరిదానవులుకపిసేనాపతుల నా. 1

మర్కటుల్బలియురై కొండలఁ బెను, మ్రాఁకులఁ బండ్ల
గోళ్లఁ బిడికిళ్లఁ । గర్కశపవఘట్టనశిలోరు, కరకపోలోదరము
ఖాంగములగల। మార్గానివైచిమోదికఱచిజీరి, మర్దించిత
న్నిసవెఱనసురులె। దుర్గానరైరిలంకకై పాఱిరి। కుర్కురశ
బ్దములాబలీముఖులు, కొలందిడకబలుతఱిమిన ప్రహస్తుఁ । డ
ర్కకులచంద్రముదితాగచరబ, లాంబుధిఁ జెల్లెలికట్టకై వడి
నిలిపె నార 2

ఒకనిఁబదిటనూటవెయ్యింటవ । నొకసులనొక్కొక్క
ములికిఁగూల్చి। నికషాత్మజమంత్రిజయప్రశస్తి నెఱయనీలుఁడద
లించి పేర్చికడిమి। నొకతరువుఁబూనివాని తేరుమీఁ,దికిఁబోయి
సూతుఁ జంపిహయముల। మకురడఁచివిలుద్రుంచ నిలనిలిచి,
తికనుక నొందకనాగకేతనుండిభంబుగతి రోఁకటనడువ నీలుఁ।
డొకటనొలసి తెలిసిపెఁ గిరివైచి, యురువడి రావణుమాతు
లుఁ బొరిగొనియె నార 3

తలలువీడరక్కసుల్బరవఁగని, తారాసూనుపై నరాంత

కుఁడు। చలమున హయముఁ దోలి శక్తినేయఁ, జలమున నంగదుఁడు వాజిపడ నడచెఁ । తలకొండకవాఁడు రథ్థలిఁ బిడికిలఁ బ్రేయ సోలి వాలి కొడుకటఁ, దెలివొంది ముష్టిఁ బొడువఁ గుంది। సోలి సె నరాంతకుఁ డప్పు డంగదుని దాఁక హనుమంతుఁ డాఁ। కలిగొనిన పులోయనఁ జెడఁజొచ్చి ఘనుఁడగు దేవాంతకుని రూపమడంచె. సార 4

అంతకాభీలుఁడగు నీలుఁడు పై, ల్లార్వ మహోదరుఁడద ల్చితన । దంతినిఁ ద్రోయని డీకొల్పి పరిఘ తాటించినఁ గపిసేనాపతి నొచ్చి పంతంబు మీఱ నగంబు గొని స, త్వరంబుగ నేయఁ గరితో నొరలి। గంతుగొనె మహోదరుఁ డంతనె జంతరమునం ద్రిశిరుఁడ నిలసుతుని శరావృతుని జేయ నతఁడరదమిం। తింతలుగఁ జేసి వారి మూఁడు తలలిలఁ గూల్చె వజ్రము గిరిం గూల్చులాగున. సార 5

అంజనీతనయుని గదఁ గొని ధూ, మ్రాక్షుఁ డేసిన బిట్టలిగి ప్లవగ । కుంజరుఁడు రుశైలము దెచ్చివైవఁ, గూలె వజ్రధారఁ బడు బలుని కరణి। కెంజాయకనుల్దుడిబడిన బొమలు పెంజీఁకటినేలువై తొఁటపులు। రంజిల నకంపనుఁడు తేరెక్కి పికఁ । శింజిని మ్రోయించి పావని మైశితాశాస్త్రములఁ, జించఁగ నకోపుఁడై వృ। భంజనాత్మజుఁడు మ్రానిచే వాని, భంజించెఁ దేవతలు జేజేయనఁగ సా

గదఁబట్టుక ద్రిప్పి మహాపార్శ్వుఁడు కాలాగ్నిసన్నిభుబు షభు నేయఁ । జదికిలపడి మూర్ఛిలి తేరి ఋష్యముఖపృథులకీశవరుఁడు బొడువ వాఁడీల్గెఁ । విదితుఁడై మహాకాయుఁడ రదంబు వెసం బఱపి సజ్యకార్ముకుఁడై । బెదరకుఁ డీకపులారా వినుఁడీ। కదనమువీరాగ్రేసరుఁడగు రాఘవేశుతోఁ గాని సేయ మాతం। ద్రిదివిజులఁ గెలిచె గ్రైలాసమెత్తె, నేపను గావున నలఁతిగా ననిపల్కె. సా. 7

అంగదుఁడుమహాకాయునిగనియా, హరిజ్యేలమీాయ య్యాను నె। అుంగుదుఁదోఁకనుజుట్టిపయోధి,లోముంచఁడేమా తం డ్రిము న్నె అుఁగవా।వెంగలీయనుచుఁబాహుముపై వ, విశిఖం బుచుఁద్రుంచి బాణవృష్టి । నంగదుముంచిగడిఁ గొసహాలయఁ గ। చొంగదారంగఁబడేఁ గపులపలఁ,సురారిమైదింటఁబదిట నొకటఁజె। లంగి మూఁటనూటవలని, లగవయగజగవాతునిల సుతాదులనేసె సా 8

అంతనంగదుఁడు తెలివొందిఘన,గదాయుతభుజుఁడై మ హాకాయుర । ధాంతమునకుఁజనిహరిసూతకే, తనచాపముల్ నుఱుమాడె నిరువ్వుగదల్। వింతగాఁగొనిపోరనవిహరిడి యుయ్యో వియఁ నుల్ల యుద్ధమునదుందుభి । నంత మొనర్చిన వాలియన లావునకు నందఅనద్ధముజుఁ బొడిచివడిఁ రణోర్వఁ పలఁద్రెవ్వ శ్రీరఘురాము । చెంత కేఁగిమొ్రొక్కన వాలిసుతుశేష గిరీం ద్రుఁడుగాఁగొనించెను జెలఁగి సారద 9

అతికాయ యుద్ధము.

11 శ్రీరాగము - త్రిపుటతాళము

పల్లవి —ఆర్యసన్నుతమైమహితంబగు, నార్య రఘుచరితమువినవే.

అను —శౌర్య,ఘనగాంభీర్య,సమరచా, తుర్యా,దిసహాయుఁ డై యతికాయుఁడై । శ్వర్యవిభవములనుసరింపన, వార్యమై గుణరవము మ్రోయఁ । సూర్యనిభమగు రథముఁబఱపి య, సురావళినోడకుఁడనిపలికె నార్య

బాణా, సారమునవనచర సేనా, నాయకులత్రుళ్లిష్ఁగం చిదీ,నానాథులఁజంపకరామ త్మౌనాధు నెదిరిను,జ్ఞానమూహిం చిరావణసూనుఁడదలించి । మానన మేలేదు, ఏనెళవుగాదుఏనీతి

యురాదు, 'మాతో వాదుఁ। బూనిమానిసివై నావు గుణహీనుఁ
డవుకులగోత్రమెఱుఁగని। వానికిపుడొ దవెనిన్నియును,సమానుఁ
డవె మాతోనని పలికె నార్య 1

మీనై, యంబుధిఁజొచ్చినా, గాని,చుట్టుమోసినాగాని
క్షోణిక్రోడీకరించినాగాని, మానెక్కపండ్లి గిలించినా।గాని,భి
క్షుఁడవై నటించినఁ,గానిగూనిబాపఁడవై నా।గాని, దొరతనము
మాని, మానివై నాముసలివై నా। గానీ, శాంతిగొనిపోరుడిగిన
గలికివయినాగాని నినుబో। నీను నీమీఁదనిడినతలఁపు, మానన
సహరితోనసురవరుఁ. డార్య 2

జ్వాలా, భీలంబౌదావాగ్ని, లీల, లక్ష్మణదేవుఁడెదిరించి।
యేలరా పడుచరజ్జులుచాలా, ప్రేలెదవుచక్కఁగానిలువునీక్రొ
వ్వడంతు జేజేలలరననిన।చాలు, సౌమిత్రి,గోలవీవు పెక్కాల
ముల తెలఁగు, లెఱుఁ, గవుజరుగు। కాలభుజగాభశరజాలము,
పాలుగావలదనదనుజును। ద్వేలఫాలమున నెత్తురొలుక, వాల
మ్మగిలించె లక్ష్మణుఁ డార్య 3

దానబల్ నొచ్చియాఘనుఁ, డేననొన్నర్వఁగ జాలునని,
ధ్యుంప। వానచేముంచెరావణి,రామానుజునతఁడ।స్త్రానలముచే
దానిమాన్పపగవానిమైతూఁపుల। వేనవేల్నించఁగా నిష్ఫల
మయ్యెహీనునకుఁ జేసినమేల్కరణినా। లోనపవనుఁడువచ్చియ
జూచే। దానవుఁడువజ్రకవచముగొని।పూనెనని తెలిపిచనరఘుకు
లుఁ, డానిశాటునికవచమునుదునిమె నార్య 4

ధీరుల్, దానవమానవరాజవీరుల్దివ్యాస్త్రముల్పరగించి।
పేరల్కఁ హారిహరికరికరి నొరసినపరుసున। పిరుతివక గెలుపును
బ్బునఁబోరిరరుదారఁ।ఘోరశరక్షత శరీరులై గైరికార క్తశైల

ములన, సొప్పిరికలన। నారినరిఁబోసి బ్రహ్మాస్త్రముదారమంత్రా న్వితముగానిం।డారఁదీసి మనుకులుఁ డేయసురారిసుతుతలఁదుని మె దుది నది యార్య. 5

ఆలో, దేవత లానందమునఁ బూలవానలుగురియించిరి। చాలా,భ క్తినతుల్ జేసినతమ్ము,నాలింగనమూని మైనిమిరేఁ గర మునద, యాఁగోలుఁ డయ్యెన్నృహరి బాళిగపులుని, ర్వేలహార్షా బ్ధిఁ, దేలి రదిజూచి, సైఁచకనేచి।కాలయములనఁ గుంభనికుం భులోలింణ కేళినగచరులం। దోలితజిమినవారిఁజంపిరి వాలిత మ్ముఁడునతనిక్రొమరుఁడు నార్య 6

యూపాక్షుండు ప్రజంఘుఁడు మైందుతోఁబోరాడి రణో ర్వీఁగూలిరి । కోపోద్దీపితుఁడై శోణితాక్షునిరూపఱ ద్వివిదుఁడు బొడిచి పాదమునఁ బ్రామెఁ బ్ర । తాపమనుపొందబాపురే యనిధూమ్రాక్షుని హనుమంతుఁ । డేపునఁ దెగటార్చి, యా ర్చెను బేర్చి । ఆపదలఁబడిపఱచిహతశేషాసురులు రావణునకె ఱుఁగ౯।రూపించిరతికాయుఁడీల్గుట, యును శేషగిరిపునిరాము నిజయ మార్య 7

---

## రావణుని ప్రథమయుద్ధము

12 గౌళరాగము - ఆదితాళము

పల్లవి.—సూరిజనసౌఖ్యదాయినీ ఝా,సుచరితము సుధీ సు వ్రతము కాత్యాయనీ

అను —పోరనతికాయాదిఘనుల్ బడుట, కారాటపడిరావణుఁ డుకనుల్చ।మీరసంయుతాగ్ని నెనయుగా,ఖరారిపైఁజనేఁగా మదినెంచిపగ। మీఱనింద్రజిత్తులంకకాపిడినమిదూర్జితరబై

బలంబున డువర్, భూరి నాయుధము గుంధమెక్కి, పొగడునని కిక్కి, నడచెనుద్రోక్కి సూరి

వింట, గొనయమిడి కపులనదరంట, శరములనేసి చంపె। దంట, యనుచు నినసుతాదుల వెంట, నంటి। మంటలడరునా రాచములచే మదమణంచి బెబ్బులి పేరాఁకట । నొంటిఁబడి వచ్చుపోల్కి దశా, ననుండు హరిగది సెనదిగని త్రిదశ। కంటకు నెదిరి విభీషణుఁడుగదా కనద్బాహుఁడై తాఁకనతని పై। నంటిన పగముచుక త్తిశక్తి,నన్నశక్తి, నేసెను యుక్తి సూరి. 1

అయ్య, స్త్రముగనినా చేవర మియ్యఁ, బడినతఁడు వధ కుదగఁ। దయ్యా, యనిన సౌమిత్రి నృపు నెయ్యమెఱింగి। చయ్య, నఁబిఱిందికి విభీషణునొయ్యఁ, దిగిచి విల్లొనియనికి గ। రియ్యుండై నిలచెశక్తి వచ్చి, నరేంద్రసుతుఁ జొచ్చి వెలిఁగెను హెచ్చి। డయ్యఁడయ్యె సకలశక్త్యాశ్రయుం, డనంతుఁడు హరికి తనువునగునతని। కెయ్యెది దుర్భరంబటులైన, నిలఁబడెదాన, నరభావాన సూరి 2

సోలి, పడియున్న లక్ష్మణుని, జాలి, కరములనెత్తఁ బోయి। వ్రాలి, రావణుఁడు సిగ్గుపడే, జాలి జగతికి। మూలమైతగు విరాట్పురుషుఁడై, పాదలు విష్ణుగదల పగసురారి। కేలీ, లనగు రావణుగనియొకింతలోనఁజని, పావనియశనిఁ। బోలు పిడికిటను గొడువమొకాళ్లు, భువిమోఁదఁబడి యతఁడు ముక్కులఁ। జాలరుధిరము గ్రక్కె లక్ష్మణుఁ, సామీరిఘనుం, డైకొనచనెను సూరి 3

రామ, త్మానాథుఁడనిలజుని, సామ, ర్థ్యముఁ బ్రియముఁగనిపొగడె। భీమా, టోపమున ధనుర్ధరుఁ, డై మారుతి

నెక్కి । కాముగెలుచునాటి, రుద్రునివలె, గదియఁదెలిసిదనుజ
కిరీటి నౌ । హేమర్షముసఁదేరెక్కి రాఁగ, నరాధిపుఁడు బాఁగా,
అదల్చిపోగా । పామరాధమా బ్రతికిపోలే మపరాధముసర్వస
ముఁడనైన నా । కేమిటికిఁ జేసితివినినుభళీ, యిలకిడుదు బలి,
యనెఁగడుఁగెరలి సూరి 4

శ్రీరా, మునినుడివినివాహనమై రా, జిలు హనుమంతు
నేసెఁ । క్రూరా, స్త్రముల రావణుఁడు కపి,వీరాగ్రణినొంచ్చి ।
భూరి తేజోబలంబునవృద్ధిఁ, బొందెఘృతమ్ముచేనగ్నివలెఁ గరసు ।
వీరుఁడపుడంజనికొమరుని, విక్షతసవ్రణునిఁ, గని రావణుని ।
తేరుగుఱ్ఱములుగొడుగువిల్సారథి కేతువులఁద్రుంచి యరచం
దుకుల । కోరి యిలబడెల్చెకిరీటము, లూల్చెరవిసము, ల్లసత్ప్రి
భముల్ సూరి 5

బాణా, వళినొంచ్చి నావిపుడు, ప్రాణా, లతోఁబో శ్రమ
ముదీఱఁ । గోణా, ధిపానాబలమరయ, జాణ, వై రేపురా ।
కానీ, యని నృహరివలుకవా, క్కాండములనునొంచ్చి సిగ్గరిక ।
రేణు, పతిమృగపతిచేఁ బడియరిందివిడువఁబడి, పలుచుకై వడి ।
మానమేదిరావణుఁడుబాఱి కడువడిఁ లంకఁజొచ్చి మదినెంచె
నా । శ్రీనివాసుఁడేరాముఁడు ధరణి, శేషగిరిధని, యనఁబరగె
నని సూరి 6

13 తోడిరాగము - అటతాళము

పల్లవి — కానుసంజీవనౌషధికల్పలతా, శ్రీమేనకానుతా వినవే
అను — ఆమీఁదనగచెరామచంద్రుఁడు, హాలక్ష్మణా హాయని
విలపించెను. కాను

తాను విష్ణుండై నను మాయ, చేను జగమునెల్లను మోహింపఁ। గానుమది నెంచి నెనరు మించి క్షోణిపైఁ బడి మూర్ఛ నొక్కియున్న। వానిఁ జూచి కన్నీరు నించి। నానోము ఫలమా నా పెన్నిధానమా నా నీడ నాతోడ నేనీతోడఁ। బూనిరాదఁ లచిని నుబిలిచిన గాని పల్కవదేకో ప్రేమా। నేనయ్యెడనే కరుణఁ జూడఁగ దేనన్ను గన్నులలరగ నన్నృహరి కామ 1

అంత రాముఁడు, చింతాకులుఁడై ధీమంతా యోహాను, మంత్రారానా। సంతాపముఁ దీర్చు, మా సంజీవిని పంతముతోఁ దెచ్చి ప్రాణములిచ్చియిగా, పట్లతమ్మునిఁ జేర్చుమా। మంతు కెక్కనీమహిమ నిన కొం, డంతై పావని మ్రొక్కి చనె నాచక్కి। అంతయును జాగులవలన వినీ, యసురపలకామే నేమి గృహా। భ్యంతరముఁ జేర వాఁడతని స, పర్యలఁ దనిపి, కార్య మేమని యడిగె. కామ 2

రామానుజు ప్రాణ, మీ మారుతి దివ్యసామగ్రికిఁ బోయె, నామార్గమున విఘ్న। మా మాయలు బన్ని, గా రేయిగడుపునీ మేలు మఱువ న, నినదశాస్యునికాల। నేమి బోధించె నెన్ని, మా మారీచుఁ। డే మాయ నట్లనె నేననుమాన, మే దిరా వణా నీ జీవన। మే మిహితసుత పౌత్ర బాంధవు, లీర్గిరవనిజ చేసిరుల చే నేమి, తను వేల హారికి సీత, నీ రాజ్యము విభీషణుని కిమ్మనెను కా

మునివై యడవికిఁ జనివై దికకర్మ ఖనివై విజనస్థలినివై తగు నునికి। గొనివై రాగ్యమున విషయాసక్తి, జనునింద్రియములమె। ల్లనఁ దిగిచి పరమాత్మ, నెనయించి చిత్తమున నిను ప్రకృతికి విలక్షణు, నిగాఁ దలపోయు। మనఘ చరాచర జగము, బుధ్యాదికముకన విన బడెడి దేది చతురా। ననుఁ డుమునుతృణముతుద

యానిదివిను ప్రకృతిజన, జననలయకారణమునదియెవ్వాయు, యనఁబడున నెనతఁడు, కామ 4

శ్యామా, గుణశుక్ల, ధామా, కృతిబ్రబల। నామా,య సృజియించి, కామ, క్రోధాది । నామా, ద్భుతసుతులను,హింసేచ్ఛాది । భామినులఁగనియదిబహు, బాళిఁజెందించఁ బరమాత్మసీగతులను । యేమియెల్లనియాత్మేశునందదిస్వగుణ । స్తోనము నారోపించు దీపించు। స్వామి, నిర్మలుఁ డైనను బ్రకృతి, సంగియైవెలిగని భ్రమసితను । దానుఅచిగుణమోహితునిగా, దలఁచితనుదెలియుక్రియవినుమ నెనతఁడు. కామ 5

ఏకా, లమునవివేకా, ఘ్యుంపయిన, శ్రీ కా, రణగురుని చేకా, యిక మోహా। శోకా, దికము లేనివానిగాఁదెలియఁ, జేకుఱున త్తటి మరల్చిచూడ్కిగనునాత్మ, జీవన్ముక్తుఁడయి ప్రాణి । ప్రాకృతగుణములచేఁబడకనీవునిన్ను, పరిశీలించుయ తూనీకశి । తూకరుణరత్నుఁడవయి ప్రకృతి, కవలివెలుఁగనియాత్మనుఁదెలియు । నీకొదవుము క్తియదిబళువే, నిసగుణాత్మధ్యానమును జేయుమనె. కామ 6

ఉదయా, ర్కోజ్వల, హృదయా, బ్జకర్ణికా, భ్యుదయాననమున, నవయామతిస్సీత । గదియనలరువాని, కన్గవయుదుటై, పొదలువానిమెఱుపుబోలుచేలము వానికదలునందెల వాని । విదిత, వనమాలాన్వితుని గౌస్తుభహారాంగదకటకకిరీటుని, పీఠాసనుని । ముదమొదవ కేలుదోయివిల్ల, మ్ములఁదాల్చికొల్చులక్ష్మణుతో । సదరహాసముగబల్కు రామ, చంద్రుధ్యానింపు, మధిపాయనెనతఁడు కామ 7

ఈరీ, తిగహరిచారి, త్రమువినుము, చేరి,శుభములవాఁ

రిజ, న్మానుసారి,గావచ్చినదురితౌఘములు, తారిచెడుగార్చిచ్చు। దారిలోదూదికంట్లము నిల్చి హెచ్చునా । నారా,చార్యవిచార పౌల స్త్యవీరవై రముకూని, భక్తిఁబూని । శ్రీరాముఁబరిపూర్ణ శోకనిసదారూఢ భావభావితునిశ । రిరనామరహితుని శేషా, ద్రినివాసుఁదలఁపుమనెమారీచజుఁడు కాను 8

14 కన్నడరాగము - ఝంపాతాళము

పల్లవి —శరణాగతసంభరణా । వరకుండలయుగళీకృతతుహిన కరచండకిరణావినవే

అను —పరతత్వశ్రయమహాత్వద్యసుధాత్వ । సరణిఁబల్కు కాలనేమిపయిఁ రావణుఁడు। కెరలితప్తఘృతంబునజలంబు బడినక్రియ । మెఱసినినునీచుఁద్రుంతు నామాటమీఁరితి వరులచే, లంచములుగ్రహించి రామకింకరుఁడవై గురుని పోల్కిబోధించె దవర రేయనఁగినుకవల,దంచుగదిలెవాఁడు శరణా

హిమవన్నగపార్శ్వమునవనమురచి, యించికాలనేమి మునివలెనుండెనుమించి । సమీరసుతునిభ్రమించఁ దలంచి। అమితజవంబునను, గపివంశమణినై, హాయనాథ్వనేఁగుచో ఋష్యాశ్రమముగని । తెమలితోవ, తొలఁగెననికలఁగియాసం। యమినడిగిపోదమనుచుఁ బోయితత్పాదములకు, మ్రొక్కి దేవ రామభద్రుదూతనుహ । నుమంతుఁడనఁదగువాఁడదృష్టాతు రుఁడనుద, కముఁజూపుత్రావిపోయెదనని పలికె శరణా 1

అమృతోపమమాకమండలంబుతో, యంబుద్రావుఫల నిచ్ఛయంబుదినువినుతంబు । సమంత్రముగనిత్తు నౌషధంబు । సమరతలంబునఁ బడినలక్ష్మణుఁడెలమి, నమరసర్వకాలవేత్తను గానఁదెలిసెను । శ్రమముదీర్చుక రేపు బొమ్ము రేపకడనని।తమక

మున మానిపలుకఁగుంభజలముప్పము, కొమరునసత్తున్నవటుని
బంపిచూపింపు। సుసుహితయనుబసమానసుతు వెంటశిష్యునం।
పినుడువుఁజూపిరన్మనెఁగనటముని. శరణా 2

కొలనాద్విజుచేననిజుఁడుగాంచి, కోర్కెమించికనులు
ముకుళించిప్రవేశించి' జలంబుద్రావెనుసంభ్రమించి।బలుమకరి
ప్రింగెనుహరిప్రనగు తనఁబకతండుహస్తముననడువఁగ వెస
మొసలితలబ। గిలిస్మృతిమైనుగవతిమైచూపట్టె' బలియుఁడభ
వద్దయనుశాండిల్యశాపము,బొలిసెనేధాన్యమాలియఁగసురాం
గనను। పాలదుమునియనుచు నస్మనిటముఁగనిన, వానిజంపివి
జయముంజేయుమనియదిచనె శరణా 3

అతివేగమోయాంజనేయుఁడటుబోవ హాయిదేమియింత
కురామియుపదేశమి। త్వతత్వదక్షిణాగాగురునావ్వమి। కుతుక
మునందినమేలనఁగ గొన్ననుచుఁ,గుటి, లయతినిముష్టిఁబొడువ
సురా। హితుఁడపుడు మతకిములుబన్నంగమరున్నందనుఁడన్ని
వితగానొనర్చికాలనేమినివధించెవి, తతమాయికునిభటుండు
మాయలఁగబడునె। శ్రితహితుఁడాక్షీరాబ్ధిఁదాటిద్రోణగిరి,
యౌషధములనుగానకగిరిఁదెచ్చె శరణా 4

ధరణీధరమస్త్రతఃమారుతిడించిరామ, ధరణీశుపాదసరో
రుహములజోహారు। శిరంబొరయ సల్పెనువేమాఱు।నర, హరి
యాదరణమెఱయఁబ్లవగకే, సరికుమారుఁ గౌఁగిలించె సుషే
ణుఁడౌషధ। వరముగొనిసౌమిత్రికిశ్రీమిఱుఁజికిత్స' నెఱపెనట
నిద్రవోయి లేచినటులనెంచి, నిలునిలుదశాననపొరిగొందునీవె
చట,। జొరఁగలవనుననుజన్ము శేషాచలేశుఁడగురఘుపతిశిరము
మూర్కొనియెదనుంచె శరణా 5

15 ఉసేనిరాగము - అటతాళము

పల్లవి —మాంగల్యమూర్తిలస, మానకీర్తిహృతాంగజార్తి వినవె

అను —ఉ,ప్పొంగిరానుభూజానిప్లవంగ,పుంగవులతోడనప్పుడు విభీషణోపాయ। సంగతుండై పోరికిం గడగె,నంగదాదులు, తుంగగిరిశృంగతరుధరులై,సింగములభంగిని జెలంగిరి మాం

రావణుడు కొలువు, లోవసించిరాత్రు నావళిఁగాంచి యనెరాముడునరుడా । భావింపమదిని, నారాయణ, దేవుఁడువిధిని, ర్ణయనుతనిచే। చావునాకిదిని, శ్చయమిందు, కై వగ వఁదుదినివిననరణ్యుఁడఁ । భూవిభుఁడునమఁదిట్టె, మావంశ జుఁడై హరినిను । నీవారిఁజంపుననిపూనెఁ,గావలయుపనిగాకకుం భకర్ణుని।ద్రావకుఁదోడి తెండనిపంపభటులేఁగి।వేవిధములఁబోధ, గావింపమేలుకొనిసురఁ। ద్రావిభుజయించిచనిసభన, గ్రజుపద ములకుమ్రొక్కెననుజుఁడు. మాంగ. 1

ఆదరించి తొడమీఁదనిడుకొని, యూదశగ్రీవుఁడని యెఁదమ్ముఁడా । పోఁద్రోయరానివెతవచ్చెనిం, కేదిగతిదీనికియ నిలోఁగ్ర । వ్యాదజనితని, క్ష్మాలనమాయె, నీదుకృపాణి, చేఁ గానిరా । మాదిశత్రులగర్వమడగ, దనినసవిర్యతఁడన్ననుగ న్గొని, ము । న్నె తెల్పలేదాదీనచేటగునసీ, తొవయితసాక్షా న్నారాయణుఁడుఈ । నాదు లేలనారదమానియొకనాటినిశిగిరి, మీఁదనేనున్నతఱి రానమ్రుఁడనై,యుదంతమడిగితిననె మాం

దేవతలుమీచేవఁజెడిపోయి,రావణకుంభకర్ణాసురులచె ట్టమీ। తోవిన్నవింపవచ్చితిమన శ్రీ దేవుఁడనుకంప, మతివెఱ

మాన్చి। వేవేనిలింపా, వసుఁడై పరమ, పావనరఘుకులో, ద్భ
వుఁడయ్యెననిసురముని పనివినె గణుతింపరా। మావతారసహ
స్రాంశసమమాహరిలీ। లావతారము లెవ్వియైనరాముఁడు
శివుఁడు। నీవురామునిభక్తిసేవింపు మెవ్వ। రావిభు భావింతుర
నఘులై వారవ్యయసుఖముఁగాంతురనెదైత్యుఁడు మాంగ 3

కుంభకర్ణువాగ్దంభము విని యారక్తాంభోజముక్రియము
ఖమొప్పఁగ। జంభాహితారాతిని, నురణవిసంభ్రముకై రావిం
చితిగాన। రంధముమేరా,రాఘవాస్త్రం। శుంభత్ప్రహార,హతి
నేచి వి। జృంభించలేవునిద్రించఁగఁబొమ్ముతంద్రీయనెనౌరా
రా, దు। ర్లంభితశాలతాబంభరుఁ డితఁడనినీలాంభోధరమువలె
మేనమరఁగోటదాఁటి ది। క్కుంభికరదృగ్గో స్తంభవిన్యస్తసిస్తు
ల।దంభోళిసమధికగదావష్టంభుఁడై వెడలెఘటకర్ణుఁడు. మాం.

పౌలస్త్యుఁడబ్ధియుల్లోలముగనార్చి యాలమునఁగపులకీ
లెడలించి జము। పొలికరాఁగా, నన్నకుమ్రొక్కి లీలననురా
గా, వహాదృష్టినను। బాలింపువేగ, విభీషణుఁడ మేలెంచిబా
గా, బోధించితి। నేఁకేంద్రునిజగన్నేతరాముఁడుసీతనిమ్మత
నికనిన। నాలోఁగాఁ, గరనాల మెత్తి చం, పఁగణగి నన్నుఁ।
బోఁదోలె రామునిచరణతోయజముల్ చేరితి। నాలసన్ముఖుఁ
డై యతం డతనిఁ గౌఁగిలించెను। శ్రీలనొందిచిరంజీవినయి శేష
గిరిపతిదయమనుమనెను మాంగ 5

16 మధ్యమావతిరాగము - ఆదితాళము

పల్లవి.—సారవచనరచనావిశారద, క్రూరదానవఖండనవిశా
రదా.

అను—ధీరుఁడై కుంభకర్ణుఁడనుజుని, నూఱడించిమదించియుం

డుట। వైరుడా పుడని తెలియకనిసమున, వారణమువలెమూ రెంగపులను సార

దండిమగలనగలించుగనికో, దండమెక్కిడియఖండాశుగ ములు । చండభానుకులుండు దనుజవరుగండమంచిమించినిం డుకోపమునననలాస్త్రమున, ఖండించెనువానివలకేల్ । మెండు గాదానిక్రిందనగచరులుబెండాబెడసరైపడిరివిను సార 1

పెరిగినపగచేసాలవృక్షముం, బెటికికొని నృకేసరికెదు రైవం । డెదురుగానరుదేరంగనిరామ, ధరణీపతిచెంగలువ । స రముబాగొనరుతూపులజూపిపటుబాహువుపటికెనైంద్ర మున । బరువుతోరానసురకాళ్లు ద్రుంచె, భల్లెయననేలపిల్లతూ పుల సార 2

దోర్లిదోర్లి బడబాముఖముక్రియ, దోడరినోరుదెఱచి చంద్రునిమ్రింగం । దన్లురాహువుమాడ్కి రామునే, దార్లగనియు పొంగ।దిగ్గవాయెల్లనిలిచితలయిలం, ద్రెళ్లనేసెనురాముడైంద్ర మునం। బొర్లిగంతలిపడెడిశిరములంక, భోరనం దనువునీర ధింబడెను సార 3

లంకగోపురముగూలెం దలతో బొంకమేది జలధితిమింగి లాది । సంకులంబయితనువుంబడిచదిసె, జంతుకోటివెలది। జంకు దీఱినుతించివిరులజడి, పొంకముగసురలుగురిసిరిఅరుణ । పంక జాతనేత్రునిధనుర్బాణ, పాణియగుకోదండరాముని సార 4

రామునిగనుంగొనదేవమునివరు, లాముకొన్నప్రేమనేం గుదెంచిరి । ధామముచేదిశలువెలుంగనుతించె, దైవతమునిహారి ని । రామచంద్రునిగురునికువలయ, శ్యామసుందరశరీరునిదయా సాముద్రక్షమితనిజాశ్రితార్తిని,లామినిశేషశైలాధిపుని సార

17 పూరిరాగము - త్రిపుటతాళము

పల్లవి.—శ్రీజగన్నాథ హేరఘువరదయానిధే. శ్రీజగ.
అను —ఓజసా తేజసా భ్రాజసేత్వన్న మోహరే శ్రీజగ

కారణాకారణాపాపనివారణా నారాయణ। ధారణాశ్రయపరమాత్మ౯ హరె శ్రీజగ. 1

నిఖిలలోకాధారనాథ౯, విశ్వస్యబోధాకర। సుఖరూపమాయామనుజశరీరం శ్రీజగ. 2

పూర్ణో౽పిసర్వేషాంసవిభాసి, స్ఫురసిత్వమమలాత్మనాం।కర్ణధారోభవాంబుధేః శ్రీజగ. 3

ఉన్మీలయన్నేత్రేసృజసిజగదుపసంహరసి। చిన్మాత్రేత్వయిసన్మనోనిమీలనేన. శ్రీజగ 4

యస్మి౯భాతీదం చరాచరం యస్మాద్భవతీదం। తస్మైబ్రహ్మణే తే నమః శ్రీజగ 5

ప్రకృతిపురుషకాలవ్యక్తావ్యక్త, బహురూపిణంజానంతియం। సుకృతినో౽ముష్మైరామాత్మనే నమః శ్రీజగ 6

త్వాం సర్వజగదాధారమూర్తిమితి, వదతిశ్రుతిరవికారంసా। శంసతిజ్ఞానరూపమాత్రం శ్రీజగ 7

నాధిగచ్ఛంతిబుధాఃశ్రుతివాదిన స్తవతత్ప్రసాదంవి,నావిరోధాద్వైతికాద్దేవనిశ్చయం శ్రీజగ 8

విలసతోమాయయాన క్వచిపిభేదోరవేరివతే। జలదర్పణాదిభిర్దృశ్యతేరామ. శ్రీజగ. 9

త్వయిభ్రాంత్యాకల్ప్యతేమనసా విషయంతవరూపం, దృశ్యకథంక। థయదృశ్యాభావేధ్యానంకథం శ్రీజగ 10

హేహా రేతేఽవతారేషు రూపాణి సుహృదోధ్యాయం
తియే । తే, హితరతిసంసారార్ణవం శ్రీజగ. 11

కామాదయశ్శత్రవోభీషయంతి మామరణ్యాగ్జాలాః।
యథామూషకాన్ తథాధర్మ సేతోః శ్రీజగ 12

మానసవాక్కాయికైస్సద్గురురూపధ్యానస్మరణార్చనే
షుధు । రీణానాంసంసృతిర్గోష్పదాయతే. శ్రీజగ 13

మామవసేవేత్వాం శేషాచలస్వామిన్ మణిరఘూణాం,
సు । స్వామన్ శ్రేయోధామన్ శ్రీజగ. 14

18 పంతువరాళిరాగము - ఆదితాళము

పల్లవి —భాషాపతినుతగుణ, హేషాపరితోషా, యోషామణి రోవినవే

అను —దోషాచరాంతకుని,భూషించినారదుడుతు । రాషాణ్ముఖ్యులఁగూడి,భాషింపుచుఁజనెను । భీషణాకృతినిగుంభకర్ణుఁడు, చేర్చిమృతుఁడౌటవిని దశాననుఁడు । రోషశోకములు బెనఁగొనఁగొలువు, లోనేలపైఁబడిమూర్ఛిల్లెను. భాషా

ఘోరుపగన్నుల, నీరు, వరదలై పార, నోరు, దెఱచియడలెను, అనుజుఁడాయని, పేరు, నుడివిబడలెను । వీరుఁడాయింద్రజిత్తు,కారుణ్యమునఁనెత్తి, శూరు, లేద్దురెనేను, పోరు,నరాఘవుల । బీర, మున్ బిరుదితండనమాన్చి, నీరుణంబుదీర్చె, దననుబంపఁగ । దేరాత్రించరశేఖరాయన,గారవమునసెలవొసంగెను

సన్నాహసేనలతో, విన్నాణియైరావణి, కన్నవారెల్లఁజెలఁగగనికుంభిలలో । నున్నయనలుఁడువెలుగఁ, జెన్నారుచెం, గల్వలుసిగఁజుట్టిసూర్యపుటము। వన్నెపటముకటిఁగట్టి, మిన్నాకెంజాయపూఁతసన్నఁగానలఁదిస్రుక్సృవాదికు, శోన్నతాస్త్ర

